# అల్లసానివాని అల్లిక జిగిబిగి



★

విశ్వనాథ సత్యనారాయణ.



★

ప్రచురణ :

కులపతి సమితి, వరంగల్.

# అంకితము

—()—

## శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి



ఇది మూఁడవ గ్రంథమ్ముగ
నొదవించెద నంకితమ్ము నొగి నీకు సదా
భ్యుదయ పరంపరగాఁ దొం
బదియేం డ్లా పైన స్వర్గ మహిమలు కలుగన్॥

ఈకాలంబున గాఢ శిల్పమతి లేనేలేదు సాహిత్య వీ
థీ కైంకర్య విశారదాత్ములకు పైతెన్నొప్ప పాండిత్య వీ
థీ కౌశల్య విగీతివాదులకు నీ ధీ వేయిగానెంచి నీ
కీ కావ్యార్థము నంకితం బొసఁగు టయ్యెన్ దీనిఁ గైకోకదే ।

1. ఆద్యాతనాః కేచి దిహ ప్రజ్ఞాపారమ్య మభినయంతి సదా
పరభాషాపరికల్పితశిక్షాభి ర్హేషు క్లృప్తముఖాః

2 శీల ఇతి కవే ర్జీవితగాథాప్రతిఫలన మితి నవపతీనాః
నిర్భ్రష్టధ్వనిమార్గాః గర్జంతి నిరంబుజలదాభాః

3. గీర్వాణీ సమలక్షణా సకలధా త్రైలింగభాషావధూః
తాం వాణీం చ [illegible] గీర్వాణవాణీం యథా
స్త్రైస్త్రై ర్గాథవిమర్శనాధ్వపటుభి ర్వాక్యైః [illegible] చాదీపయన్
వ్యాచిఖ్యాసు రిహాం త్రైలింగవచసాం కేషాం కవీనాం మతిః

4 అభినవగుప్తో మమ్మట ఉజ్వలఫేకో మహాన్ జగన్నాథః
గీర్వాణసుకవికావ్యాన్ మమంథు రతిదేవగురుమతిప్రతిభాః

5. క్వ తే సకలశాస్త్రనిర్మథనధీమహాభూధృతః
క్వ చాహ మణుభూతధీపరిణతాల్పవాచాం పదం
తథాపి చ వివర్తనం పటుతరాంధ్రవాచాం ద్యుతేః
కృతం న పటుశాస్త్రవిద్భి రితి ధైర్యతో యత్నవాన్

6. మయా వ్యరచి పూర్వపణితిః సుమేవ ఖలు నన్నపార్యోజ్జ్వల
తత్కథాకలితసుప్రసన్నఫణితి స్సుశిల్పాకృతిః
పున ర్విరచయామి తావ దిహ పెద్దనార్యోజ్జ్వల
తత్కథాకలితసుప్రసన్నఫణితిం సుశిల్పాకృతిమ్

1. అద్యతనాః కేచి దిహ ప్రజ్ఞాపారమ్య మభినయంతి సదా
పరభాషాపరికల్పితశిక్యాభో హేషు కష్టముఖాః

2 శీల ఇతి కవే ర్జీవితగాథాప్రతిఫలన మితి నవపవీనాః
నిర్కృష్టధ్వనిమార్గాః గర్జంతి నిరంబుజలదాభాః

3. గీర్వాణీ సమలక్షణా సకలభా త్రైలింగభాషావహాః
తాం వాణీం చ వచఃప్రమాణవిషణాః గీర్వాణవాణీం యథా
స్వైస్వై ర్గాథవిమర్శనాధ్వపటుభి ర్వాక్యై ర్న చాదీపయన్
వ్యాచిఖ్యాసు రహం త్రిలింగవచసాం కేషాం కవీనాం మతీః

4 అభినవగుప్తో మమ్మట ఉజ్వలభేకో మహాన్ జగన్నాథః
గీర్వాణసుకవికావ్యాన్ మమంథు రతిదేవగురుమతిప్రతిభాః

5. క్వ తే సకలశాస్త్రనిర్మథనధీమహాభూభృతః
క్వ చాహ మణుభూతధీపరిణతాల్పవాచాం పదం
తథాపి చ వివర్తనం పటుతరాంధ్రవాచాం ద్యుతేః
కృతం న పటుశాస్త్రవిద్భి రితి ధైర్యతో యత్నవాన్

6. మయా వ్యరచి పూర్వపణితిః సుమేవ ఖలు నన్నపార్యోజ్జ్వల
తర్కథాకలితసుప్రసన్నఫణితి స్సుశిల్పాకృతిః
పున ర్విరచయామి తావ దిహ పెద్దనార్యోజ్జ్వల
తర్కథాకలితసుప్రసన్నఫణితిం సుశిల్పాకృతిమ్

పెద్దన్నగారికి 'ఆంధ్రకవితాపితామహుఁ' డని బిరుదు శ్రీకృష్ణదేవరాయలవా రిచ్చినది. కృష్ణరాయఁడు విద్వత్ప్రభువు, భావుకుఁడు, సహజముగా గొప్పకవి. ఆ ప్రభువునకు తత్పూర్వమున కవిత్రయము, పోతన్న, శ్రీనాథుఁడు మొదలైన మహానుభావు లున్నారని తెలియదా? నాచన సోమన్న యున్నాడని తెలియదా? పెద్దన్న కీబిరు దిచ్చుటయేమి? తాను వైష్ణవ ప్రభువు. పెద్దన్నకూడ వైష్ణవుఁడే. ఈయభిమానముచేత నిచ్చెనా?

లేదా, ఆంధ్రకవిత యనగా, కృష్ణరాయని యభిప్రాయము వేఱా? తత్పూర్వకవులందఱు సంస్కృతకావ్యములను తెలుఁగు చేసిరి. తొలుదొల్త స్వతంత్రకావ్యమును తెలుఁగులో పెద్దన్నగారే వ్రాసిరి అందుచేత నిచ్చుటి నుండియే యాంధ్రకవితాప్రారంభ మనియా? పెద్దన్నగారును మార్కండేయ పురాణములోని కథను స్వీకరించియే వ్రాసిరి. పూర్వకవుల తెల్గుసేతయు మక్కికి మక్కిగా లేదు. కనుక నిదియే యాంధ్రకవితాసమారంభ మనుటకు రాయల వారి బుద్ధిలో పద్యరచనయని కాదు, తెలుగుసేత యని కాదు, స్వతంత్రకావ్య మనిపించుకోదగిన యాంధ్రపద్య గ్రంథమని నిర్ణయము చేసికోవచ్చును. ఇచట ప్రాధాన్యము కావ్యశబ్దమునకు. ఈలెక్కను భారతము కావ్యము కాదా? పెంపులు, తగ్గింపు లున్నను తెలుగులో స్వతంత్రకావ్యము కాదు. శ్రీనాథుని నైషధము కాదు. భాగవతమును గాదు.

కావ్యలక్షణములు పట్టించినచో మనుచరిత్రయే ప్రథమ కావ్యము. ఒకగ్రంథమును కావ్యముగా నిర్ణయించ వలసినప్పుడు ప్రసిద్ధమైన మార్గ మొకటి కలదు. ఏకరసాశ్రయ మైన కథ. శృంగారరస మైనచో నాయికానాయకులు, తది తరరసములకు తత్తదుచితలక్షణములు, ప్రధానరసము, అంగ రసములు, వానిపోసగింపు, నాయకలక్షణము మొదలైనవాని పరామర్శ. ఇది ప్రసిద్ధమైన కావ్యలక్షణము.

రెండవది ప్రసిద్ధమైనది కాదు. అనగా బహుజనులచేత పర్యాలోచింపఁబడుచున్నది కాదు. ఒక్కొక్కప్పు డీరెండవలక్ష ణము మొదటి లక్షణముగల కావ్యమునిండ నిండియుండ వచ్చును. ఈకావ్యలక్షణము కావ్యశిల్పముతో కూడినది. శిల్పశబ్దము సునిర్దిష్టార్థకము కాదు. శిల్ప మన్నమాట సార స్వతములోనికి గౌణార్థముగా తెచ్చికొన్నదికాని, సారస్వ తమునకు సహజమైనది కాదు. తనకావ్యము శిల్పమని తిక్కన్న చెప్పినాడు. అచ్చటనైననింతే. శబ్దము నూతనము కాని ఏయర్థము నుద్దేశించి యాశబ్దము వాడబడుచున్నదో, ఆయర్థము కావ్యదృష్టిచేత నూతనమైనది కాదు. మొదట కావ్యలక్షణముగాఁ జెప్పినదానియందును శిల్పశబ్దము ప్రయో గింపవచ్చును. రసభంగము లేకుండ, ఔచిత్యభంగము లేకుండ చేసిన రచన శిల్పము కా దనుటకు వీలు లేదు. కాని ఈశిల్పశబ్దార్థము తదితరములైన విశేషవిషయములందు సమన్వయపఱచుట యధిక సమంజసము. రసౌచిత్యాది శబ్దము లున్నప్పుడు శిల్పశబ్ద మెందులకు ? దానినే శిల్ప మన్నచో మా కభ్యంతరము లేదు. కాని శిల్పశబ్దము తదిత

రములైనవానియం దుపయోగించుట న్యాయ్యము.

తదితరములైన వేవియో యున్నవన్న వానికి వేఱే పేర్లు లేవా? అన్నచో, వానికి నున్నవి. సూచ్యార్థసూచనము, గండము మొదలైనవి కలవు. అవి రూపకలక్షణమునందు చెప్పబడియున్నవి. వానిని కావ్యమునందు ప్రయోగించ వచ్చును. ఇచట నివి ప్రయోగింపరాదను నిబంధన లేదు. మఱియు శిల్పమని మనము చెప్పినవిషయము బహుధాప్రపం చితమైన యలంకారశాస్త్రములో నేదో యొకవిషయము కావచ్చును. అప్పుడు దీనికి ప్రత్యేకముగా నీశిల్పమన్న పేరేమి?

దాని శిల్ప మిది: మహాకవి తాను స్వీకరించిన వస్తువు నకు పరమోచితములైన తత్తన్మహావిషయములయందలి సామగ్రీసంపాదనము చేసి తనకావ్యము పరమశిల్పఖండ ముగా చేయును. ఈ కావ్యసౌందర్య మధికముగా భాసిం చుట తత్తద్భిన్నవిషయసంగ్రహణముచేత నగును. అప్పు డది శిల్ప మని చెప్పవచ్చునేమో!

ఈ శిల్పమన్న మాటయే 'అల్లికజిగిబిగి'లో నున్నది ఈమాట ప్రసిద్ధచాటువులోనిది.

> 'అల్లసానివాని యల్లికజిగిబిగి, ముక్కుతిమ్మనార్య ముద్దుపల్కు
> పాండురంగవిభుని పదగుంఫనంబును. . . . '

ఇందులో ముగ్గురు కవుల మూడులక్షణములు చెప్పం బడినవి. స్థూలముగా చూచినచో నీమూడులక్షణములును వారికవితాశైలులకు సంబంధించినట్లుగానే కన్పించును. ముక్కుతిమ్మన్న 'ముద్దుపలుకు' పలుకుపోడిమిని చెప్పు

చున్నది. 'పదగుంఫనము' పలుకుపోడిమిని చెప్పుచున్నది. అందుచేత 'అల్లికజిగిబిగి'యును పెద్దన్నగారి శైలిని గుఱించియే చెప్పినది కావలయును. ఐనచో పెద్దన్న శైలిలో 'జిగిబిగి' కలదా? జిగిబిగి ఒక్కశబ్దమా, రెండుశబ్దములా? జిగి యనగా కాంతి, బిగి యనగా బిగువు. జిగిబిగులు కావలె. లేదా సమాహారద్వంద్వము చేసి యేకవద్భావ మనుకొనవలె. కాని లోకములో నీశబ్దము చిక్కగానున్న పరిస్థితికి చెప్పుట కలదు. "అది యెంతయు జిగిబిగిగా నున్నది" అని లోకము. రెండును రెండుశబ్దములైనచో, నీరెండుగుణములు పెద్దన్న గారి శైలియందు కలవు. ఆయనసర్వరచనయు కాంతితో కూడిన బిగువు కలదియే. ఈజిగిబిగియే పురాణకవితనుండి కావ్యకవితను వేఱుచేయునది. ఇది వేఱువిషయము.

ఈశబ్దార్థ మింతటితో పర్యవసించదు. పెద్దన్నగారి కావ్యరచనాశిల్పమునుగూడ స్పృశించును. ఎందుకు స్పృశించవలయును? స్పృశించినచో చాటుపద్యకర్తయొక్క మనోలక్షణమునకు భిన్నము కాదు. అతనిమనోలక్షణము చూడుడు.

'పాండురంగవిభుని పదగుంఫనము'

పాండురంగవిభుఁ డెవడు? పాండురంగమాహాత్మ్యము వ్రాసినది పాండురంగవిభుడా? ఆపాండురంగఁడే పాండురంగమాహాత్మ్యము వ్రాసెనా? అతనితాత్పర్యము తెనాలి రామకృష్ణకవి యని. అతనితాత్పర్యము వేఱు వేసినశబ్దము వేఱు. అల్లసానివాఁడు, ముక్కు తిమ్మనార్యుఁడు, మాదయ కవివద్దకు వచ్చువేళకు పాంథురంగవిభుఁ డయ్యెను. అల్లె

ముద్దుపలుకు, పదగుంఫనము, అల్లికజిగిబిగిదగ్గఱకు వచ్చు నప్పటికి వట్టిశైలి కాక మరియొక్కటి కావచ్చును. పైగా అల్లిక,కూర్పు- ఈరెండుమాట లున్నవి. కూర్చుట యన్న యర్థములో అల్లికశబ్దము వాడము. అల్పములైన విషయములను, ఒక చిన్నసందర్భములోని భిన్నాంగములను జతపఱచుట కూర్పు కావచ్చు. అల్లిక యనఁగా నట్టిది కాదు. దేనికది ప్రత్యేకత గలిగిన సమానవిషయములు కావచ్చును. విషయములను దీసికొని, పెద్దవస్తువుగాఁ దీర్చుట పేరల్లిక. విడివిడి దారములతో నొక పట మల్లవచ్చును విడివిడితుంగలతో చాప నల్లవచ్చును. చాపను గూర్చెనని గాని, పటముఁ గూర్చెననిగాని యనుటలేదు. పద్యమును గూర్చుట యనిన రమ్యత కలదు. పద్యము నల్లుట యనినచో నంత రమ్యము కాదు. కాని పద్యము నల్లుటయని కవులు వాడిన ప్రదేశములు కలవు. అచ్చటనైన పద్యము నల్లుట యని యెవ్వరు వాడలేదు. పద్యము లల్లుటయని బహువచనముతోడనే వాడఁబడినది.

అందుచేత నీయల్లికయన్న శబ్దము కావ్యరచనా శిల్పసంబంధిగాని పద్యరచనాశిల్పసంబంధి కాదు. కాని ఇచట ప్రత్యేకాన్వయము చెప్పవచ్చు ననవచ్చును అట్లయినను మాకు విప్రతిపత్తి లేదు

అందుచేత నల్లిక యన్నది కావ్యగతమహాశిల్పమునకు, జిగిబిగి యన్నది దానిలోని చిక్కనకు లక్షకములుగా పర్యవసితమైనవి. శిల్పమన్నమాట వేరే యర్థములో నేను చెప్పుచుంటినిగదా! తచ్ఛబ్దార్థము సర్వవిమర్శనము జరిగిన

తరువాత దానియందంతట నదియే యవగతము కాగలదు.

ఈగ్రంథము మనుచరిత్ర మని ప్రావాహికముగా నున్నను, స్వారోచిషమనుసంభవము దీనిపేరు. పెద్దన్న గారే "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధంబునకు" అని చెప్పినారు.

"మనువులలో స్వారోచిషమనుసంభవ మరయ" ననియు తత్పూర్వము చెప్పఁబడినది. ఇది మనుసంభవము. కుమారసంభవమువంటిది. మనువు పుట్టుకకు హేతువులైన తత్పూర్వకథాసంతతులను చెప్పు కావ్యముగాని, మనువును గురించి చెప్పు కావ్యము గాదు. కుమారసంభవమువంటిది గూడ కాదు. కుమారసంభవము ప్రధానముగా పార్వతీపరమేశ్వరుల సంయోగకథనకావ్యము తత్సంయోగహేతుకమైన మన్మథదహనాదులతో ప్రారంభింపవచ్చును. ఈ మనుసంభవము స్వారోచిషమనుతండ్రియైన స్వరోచియు, నతనిభార్యయు – వారిసంగమకథ కాదు. స్వారోచిష మనువు స్వరోచి పెండ్లియాడిన ముగ్గురు భార్యలందును పుట్టినవాడు కాదు. మనోరమయందు విజయుండును, విభావసియందు మేరునందనుండును, కళావతియందు విభాసుండును నను ముగ్గురు పుత్రులు స్వరోచికి జనియించిరి. వారు వేఱువేఱు రాజ్యములకు రాజు లయిరి. ఈస్వారోచిషుఁడు వనదేవతకును, స్వరోచికిని బుట్టినవాఁడు.

స్వరోచి వరూథినికొడుకు. వరూథినీగంధర్వసమాగమమువలన గలిగినవాడు. స్వారోచిషమనువు స్వరోచికి

నన దేవతయందు పుట్టుట ఈకావ్యమునందు పదిపద్యములలో చెప్పఁబడిన కథ దీనికి మనుసంభవ మను పే రెందులకు?

శిల్పము రెండులక్షణములు కలదని పూర్వము చెప్పితిని. ఇది రెండవలక్షణ మని చెప్పితిని. అనఁగా కావ్య నిర్మాణ కౌశల్యముచేత, నొకవిలక్షణమైన శిల్పము సంపాదించుటచేత, కావ్యమునం దేకవాక్యతను కల్గించును ఇది యిచ్చటి శిల్పలక్షణము.

ఈ ఏకవాక్యతాసంపాదకశిల్పమును మరియొకవ్యాసము నందు ప్రపంచింతును. తొలుత కావ్యారంభమును పరిశీలించినచో ఆప్రోవ కొంత సుగమ మగును.

ఈగ్రంథమునకు తొలుత నైదుపద్యములు దేవతా స్తోత్రములు కలవు.

"ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశో వా తన్ముఖమ్" అన్నారుగదా! ఇది నమస్క్రియారూపకమైనది. మొదటి పద్యమునందు విష్ణుమూర్తిని, రెండవపద్యమునందు బ్రహ్మను, నాల్గవ దానియందు విఘ్నేశ్వరుని కవి స్తోత్రము చేసియున్నాడు. ఐదవది సరస్వతీస్తోత్రము. ఇవి స్తోత్రములేకాని, యథార్థమునకు కృతినాయకుని నాశీర్వదించుట.

శిల్ప మనఁగా నొకమాటలో చెప్పినచో బహ్వర్థము లేకత్ర సమావేశపఱచి, పఠితయొక్క మనస్సును భావనామయము చేసి. ఉత్పథమునందు సంచరింపఁజేయుట. ఈ బహ్వర్థములు బహుమార్గముల సంధానపఱచవచ్చును. అది కవియొక్క నైపుణిమీద నాధారపడియుండును.

సరస్వతీప్రార్థనము వదలి తక్కిన నాల్గు ప్రార్థనములను పరిశీలింతము బ్రహ్మను చేసిన స్తుతిలక్షణము వేఱు. తక్కిన మూఁడు వేఱు. హరిహరవినాయకులస్తుతులు మూఁడును భ్రాంతిమీఁద నిర్మింపఁబడిన స్తుతులు. బ్రహ్మ స్తుతిలో భ్రాంతి లేదు. కాని భ్రాంతిలేని యాబ్రహ్మస్తుతి వినాయకస్తుతి పూర్వము, హరిహరస్తుతి పరము. భ్రాంతిమద లంకారము సంయోజనము సేయుచు రెండుస్తుతులు వ్రాసి, మూఁడవదానియందు వదలిపెట్టి, నాల్గవదానియందు మరల నెత్తికొనుట యెందుకు?

ఈభ్రాంతులలో భేదము చూతము. మొదటిది లక్ష్మీదేవికుచకస్తూరికాచిహ్నము హరియొక్కయొమ్మునఁ జూచి సనకసనందనాదులు లక్ష్మితోపాటు భూదేవినిగూడ పెట్టెనేమోయని పడిన భ్రాంతి. భ్రాంతి సనకసనందనాదులయందు.

ఈభ్రాంతి నిశ్చయము. అనఁగా వారు నిశ్చయముగా భ్రాంతి పొందిరి.

రెండవది అర్జునునకు పాశుపతాస్త్ర మిచ్చుచున్న హరుని పార్వతి ఉల్లసమాడినది "నీ కులములో దయ కనిపించిన"దని. శివుఁడు మాయాభిల్లుఁడు కాని యథార్థబిల్లుడు కాడు - అని పార్వతికి దెలియును. శివునకును దెలియును. ఇది వట్టిపరాచికము అయథార్థమని యిద్దరికిఁ దెలిసినప్పుడు గాలిలోని పరాచికము.

నాల్గవపద్యములో వినాయకుడు తల్లిచనుబాలు త్రాగుచున్నాడు. బాల్యాంకవిచేష్టచేత తుండమున నవ్వాలిచక్కగబళింపఁబోయినాడు. ఆవంక కుచంబుఁ గానలేదు. అహి

వల్లభహారమును జూచినాడు. మృణాళాంకురశంకతో తాకి నాడు. ఇది భ్రాంతి.

మొదటిది భ్రాంతిమదలంకారము. రెండవది విషమాలంకారము. మూడవది భ్రాంతి. అన్నింటికి మూలభూతమైనది భ్రాంతివిశేషము. సర్వాలంకారము లుపమామూలకములు. మొదటిది పరులు పొందిన భ్రాంతి, రెండవది హేల, మూఁడవదియు భ్రాంతియే. ఈవరుసలో నెందుకు చెప్పఁబడెను ? నడుమ బ్రహ్మస్తుతి యున్నది.

ఈకావ్యమునందు తొలుత ప్రవరాఖ్యుని కథ. అందులోనిదే గంధర్వుని కథ. తరువాత స్వారోచికథ. చివరకు మనువు పుట్టుట. ఈనాల్గువిషయముల కూడిక ఈమహాప్రబంధము.

వరూథిని ప్రవరాఖ్యునిచేత నిరాకరింపఁబడినది. గంధర్వుఁడు మాయాప్రవరాఖ్యుఁడుగా వచ్చెను. అతనియందు ప్రవరభ్రాంతి పొందినది. వాఁడు ప్రవరుఁడు కానేకాఁడు; ప్రవరునిముద్ర కలవాఁడు; లక్ష్మీదేవికుచకస్తూరికాచిహ్నము వలె. వరూథిని సనకసనందనస్థానీయురాలు. ఆ పడిన భ్రాంతి పరమేశ్వరవిషయము, పడ్డవారు మహర్షులు. వరూథిని గంధర్వునియందు ప్రవరభ్రాంతి పొందినచో నామెయొక్క ఋషుల మనోనైశ్చల్యమువంటి పరమస్త్రీభావనానైశిత్యమునకు లోపము లేదు.

ఇక్కడికి ప్రవరవరూథినుల కథ "శ్రీవక్షోజ" పద్యముతో స్ఫురింపఁజేయఁబడినది.

పార్వతి శివునితో నుల్లసమాడుట గంధర్వవరూధి నుల హేలావిశేషసూచకము. ఇది విషమాలంకారము. విరూపకార్యోత్పత్తి విషమాలంకారము. ఈవిరూప కార్యోత్పత్తి స్వరూప మెట్టిది? పైకి కనపడుచున్నది కాదు. లోని యథార్థము యథార్థముగానే యుండుట. శివుఁడు మాయాభిల్లుఁడగుట కాదు. శివుఁడు శివుఁడగుటయే యాయన దయకు హేతువు. వరూధిని కన్న సంతానము గంధర్వునకు కనలేదు. ప్రవరునికే కన్నది. ఇది ఇందులోని రహస్యము.

"మున్ను విప్రాకారమునఁ గూడుచో శంక
గను మాయఁ బనిచె నాఖచరభర్త,
యవ్వరారోహయు నాసక్తగావున
నిచ్చలో నటు సేయ నియ్యకొనియె,
నాప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంత న
వ్వనితకు రతిపారవశ్యపటిమ,
నపుడు తత్ప్రవరదేహసమిద్ధశిఖిదీప్తి
శాంబరీమహిమచేసంగ్రహించి
నట్టి గంధర్వమూర్తిసౌఖ్యానుభూతిఁ
జలన మేదిన మానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి
మేటిగర్భంబు నెలలు తొమ్మిదియు నిండె.

గంధర్వుఁడు శాంబరీమహిమచేత ప్రవరదేహసమిద్ధ శిఖదీప్తిని పంగ్రహించినాడు. ఆశిఖదీప్తి వరూధినియొక్క చలనములేని మానసాబ్జమున నిలచినది. ఇది రహస్యము.

వరూధినీసంతానము గంధర్వసంతానము కాదు; ప్రవరసంతానము. ప్రవరుఁడు వట్టిప్రవరుఁడు గాడు. శిఖిమూర్తి. సర్వవేదములయందును చెప్పఁబడిన యగ్ని. 'అగ్ని మీళే పురోహితమ్' మొదలు పంచాగ్నివిద్యాగతమైన యగ్నితోపాటు యజమానుఁడైన యగ్నివరకు వ్యాపించి నిత్యాగ్నిహోత్రికి ధ్యేయుఁడై సర్వవైదికప్రపంచమునకు, వైదికాచారపరంపరకు, వైదికధర్మపరంపరకు, వైదికకర్మపరంపరకు మూలభూతమైన 'అగ్నిముఖా వై దేవాః' అన్న వాక్యములోని అగ్ని ప్రవరదేహగతమై యున్నది. ఆయగ్ని వరూధినీగర్భమునఁ ప్రవేశించినది.

ఇప్పటికి మొదటి రెండుపద్యములలోని కథాసూచ్యత్వము చెప్పఁబడినది. తరువాతిది 'నాలుగుమోముల నిగమనాదము' లన్న పద్యము. ఇందులో వట్టి ఉపమాలంకారము. భ్రాంతిలేదు, విషమాలంకారము లేదు. ఉపమాలంకారము మాత్ర మెందు కుండవలయును? మొదటి రెండుపద్యములలో స్వరోచిజననమువరకు సూచింపఁబడగా ఈబ్రహ్మస్తోత్రపద్యములో స్వరోచిజీవితము సూచింపఁబడినది స్వరోచి బ్రహ్మ, ఆయనకొడుకు స్వారోచిషుఁడు మనువు. బ్రహ్మకు నాల్గుముఖములు, స్వరోచికి నలుగురు భార్యలు. నాలుగుముఖములయందు వేదములు మ్రోగుచున్నవి. అవి విద్యాస్థానములు. మనోరమ యాయుర్వేద మిచ్చినది, విభావసి మృగపక్షిజాతుల భాషలు తెలిసికొను విద్య నిచ్చినది. కలావతి పద్మిని యను విద్య నిచ్చినది. ఈముగ్గురు విద్యాస్థానములు. సామ ఋక్ యజుః స్థానీయలు. వనదేవత యథర్వవేద

స్థానీయురాలు. ఇట్లు బ్రహ్మస్తోత్రములో స్వారోచికథాసూచనము జరిగినది.

మిగిలినది 'అంకముఁ జేరి శైలతనయా స్తనదుగ్ధములు.' మరల భ్రాంతిమదలంకారము. స్వారోచిషమనువు జన్మించెను. మనువు జన్మించినాడు. అట్లు జనియించి అకామతచిరతపం బాచరించె.

తప స్సనఁగా నేమి? స్వస్థితి! పరిణతుఁడైన జీవుని యొక్క స్వస్థితి. వినాయకుఁడు అహివల్లభహారము చూచి మృణాళాంకుర మనుకొన్నాఁడట! మఱి యింకొకఁ డెందు కనుకోలేదు? పరమేశ్వరుఁడైన విఘ్నేశ్వరుఁడు తనసహజలక్షణమును జూచుకొన్నాడుకాని, పెఱలక్షణము నెంచి భ్రాంతిపడలేదు. ఇందులో నొక చమత్కార మున్నది. మృణాళాంకుర మనుకొన్నాడు. మృణాళమునుండి పద్మము భాసించును. పద్మపువ్వు పూర్వరూపము మృణాళము, రూపతః.

పద్మ మనఁగా నేమి? మన సర్వసారస్వతము విచారించినచో విష్ణునాభి పద్మము. బ్రహ్మపుట్టినది పద్మమునందు. హృదయము పద్మము. లక్ష్మీదేవి పద్మమునుండి పుట్టినది. ఈపద్మముయొక్క నిజమైన యథార్థ మేమో తెలియదు. ఒకటిగా భాసించుచున్నది. ఇది సర్వజ్ఞానము యొక్క జనిస్థానము.

సర్వజ్ఞానము దేనినుండి పుట్టుచున్నది? తపస్సునుండి పుట్టుచున్నది. తపస్సు మృణాళనాళాంకురము. అయథార్థమైన జగత్తు అహివంటిది. తపస్సు మృణాళ

నాళమువంటిది. దానిచివర నున్నది పద్మము. ఆపద్మమే సర్వజ్ఞానభూమి, మనువుయొక్క మనస్సు.

ఇది యంతయు కల్పనయని చెప్పుటకు చాల వీలున్నది. కల్పన కాదు. విచారలక్షణము. అందుకనియే "వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః నహి సందేహాదలక్షణమ్" అన్నారు. వ్యాఖ్యానము మనసూత్రభాష్యాదిగా ప్రపంచితమైన వైదికసారస్వతమున కాయువుపట్టు.

మొదటి పద్యమునం దొక విషయము చెప్పవలయును. అక్కడి భ్రాంతి సనకసనందనాదులది అని చెప్పితిమి. వారికి భ్రాంతి లేదు. ఉన్నదేమోయని కవి యుత్ప్రేక్ష. ఇది యొక ముడి. తత్ప్రవరదేహసమిద్ధశిఖదీప్తి శాంబరీమహిమచే సంగ్రహించిన గంధర్వునిలో నున్న వెలుఁగు వరూధినీగర్భమునఁ బ్రవేశించినదని విస్పష్టముగాఁ జెప్పఁబడినదిగదా! భ్రాంతి లేదు, ఉత్ప్రేక్ష లేదు. భ్రాంతియు, నుత్ప్రేక్షయు నచట వాక్యగతములు. అవిచారితమూలకమైన చదువులోని భాగములు. అది లోకములో నున్నదిగదా! దానిని పెద్దన్నగారు స్పృశించినారు.

ఇంక నొక్క విషయము మిగిలినది. ఈరీతిగా భావ్యర్థసూచనము తాత్పర్యతః నాటకాదులయందు విశేషింపఁదగినదికాని కావ్యములందు కాదు. అనగా అదియొక శిల్పపద్ధతి. మహాకవి తనయిచ్చవచ్చినచోట నుపయోగించును. ఏవో కొన్ని నాటకలక్షణములవంటివానిని కావ్యమునందు చూచి నాటకమువలె వ్రాసినాడని "నరీనృత్యంతే" కదా! అట్లిక్కడగూడ చేయవచ్చును. వారిబుద్ధిలో నాటక

లక్షణము కావ్యమునందు ప్రయోగించుట యధికశిల్ప మనియే కదా !

ఏతత్సర్వపిండితార్థ మిదియ. ఉత్ప్రేక్షయందు యాథార్థ్యము లేదు. కావున కవి యుద్దేశ్యము, కలిగినది వరూధినీగర్భనిహితప్రవర తేజోనిధానముగాని, గంధర్వ తేజోనిధానము కాదు. వరూధినీగంధర్వసంధానము భ్రాంతి. ఇది భ్రాంతి యేల యనఁగా శరీరాప్రాధాన్యమువలన.

జరిగినది వరూధినీగంధర్వసమాగమము, కాఁగా కలిగినది ప్రవర తేజోనిధానము. ఇది విరూపకార్యోత్పత్తి,

మొత్తముమీాద నీనాల్గుపద్యములయందు స్వీక రించిన యలంకారము కావ్యగతభిన్నాంశసూచనకోసము స్వీకరింపఁబడినది. బహ్వర్థములు, బహుభావములు నేకత్రి సమాయోజన చేసి పఠితబుద్ధి నొరపిడిపెట్టుట శిల్పలక్షణము; శిల్పియొక్క శిల్పరహస్యము. ఇట్టియలంకారములను గ్రహిం చుటలోఁగూడ వేఱే ప్రయోజనము కలిగియుండుట పెద్దన్న యెంతశిల్పి యనవలయును ?

౨

ఒక కావ్యమునందు పరమమైన విషయము ఏక వాక్యత.

కథాకావ్యములందు చాలవానియందు ఏదో యొక రసము ప్రధానముగా నుండును. సర్వకథయు నారసము చుట్టుఁ దిరుగును. ప్రధానరసమునకుఁ దక్కినరసము లంగ ములుగా నుండును. ఈఅంగాంగిభావము సంబాళించుకొను

టలో మహాకవి యొక్క నేర్పు కలిగియుండును. ఆనేర్పే కవిని మహాకవిని జేయునది. పద్యరచనాదులు కావు; వర్ణనాదులు కాదు; లక్ష చిన్నచిన్న చమత్కారములు కాదు. పద్యరచనమొదలు తావత్పర్యంతము మహాసామర్థ్యముకల్గి, ఈప్రధానరసము చక్కగా దీర్చి, అంగరసములను బ్రధానరసమునకుఁ బోషకములుగాఁ జేసి, యనౌచిత్యములను బరిహరించి, ప్రతిభాసమున్మేషమున నెవ్వఁడు తనకావ్య మాద్యంతము రత్నశలాకవలె తీర్చిదిద్దికొనునో, ఆతఁడే మహాకవిశబ్దవాచ్యుఁడు.

ఈకవితావిద్య పద్యరచనమొదలు కావ్యగ్రథనకౌశలాంతము వ్యాపించియున్నది. పద్యరచనాది శక్తి లేనిచో కావ్యమే లేదు. కాని కావ్యగ్రథనకౌశలమే చివరిమెట్టు. అన్నియుగలిగినవాఁడు మహాకవి; కొన్నికలిగినవాఁడు కవి మాత్రము. పలుమంది మధురముగాను, సుకుమారముగాను, ఒక ప్రసిద్ధకవిశయ్య ననుసరించి, యొక సొగసు కలుగునట్లుగా ధారాళముగాఁ బద్యరచన సేయవచ్చును. లోకము పద్యరచనలోని మాధుర్యాదిగుణములకుమాత్రము వశమైనట్లు కనిపించుచున్నది. ఇది ప్రశంసనీయమైన విషయము కాదు. మహోత్తమమైనవిషయము కావ్యగ్రథనకౌశలము. పరమభావుకుఁడు దానిమీఁద దృష్టితోఁ గావ్యమును జదువును.

ఈకావ్యగ్రథనకౌశలము కవియొక్కబుద్ధికి సంబంధించినది. పద్యరచనాదులు వాని కవితాశక్తిని సంబంధించినవి. గ్రథనకౌశలము కవియొక్క కవితాశక్తికి బాహిర

మైన విషయ మనవచ్చునా ? గ్రథన కౌశలముకంటె పద్య రచనాదులే మహాకవిని జేయుననవచ్చునా ? లోకమునందుఁ బలుమంది పలుకార్యములు చేయుదురు. ఎవఁ డెక్కువ వివేకముతో నా పనిని జేయునో వానిచేత బాగుగా నున్న దందురుకదా! వివేకసంయోజనములేని కార్యము కార్యముగాఁ బరిణమించదు. అట్లే మహాకావ్యశిల్పపరిజ్ఞానము లేని, తత్పరిజ్ఞానము వెలయించ నేరనికావ్యము కావ్యముకాదు. ఈ పరిజ్ఞానాతిశయము భాసించినకొలఁది మహాకావ్యమగును అతఁడు మహాకవి యగును. ఇందు విప్రతిపత్తి లేదు.

ప్రస్తుతము మనుచరిత్రము నీదృష్టితో విచారించ వలయును. అపుడు మనుచరిత్రము మహాకావ్య మగును. పెద్దన్న మహాకవి యగును. ఇట్టి కావ్యములు తెలుగులో నెన్ని కలవు? ఈ లక్షణములు లేని కావ్యములుగూడ మహాకావ్యము లగునా ? వారు కూడా మహాకవు లగుదురా ? అన్న విషయము తరువాత విచారణీయ మగుచున్నది.

ఈ గ్రంథము పేరు 'స్వారోచిషమనుసంభవము. సంస్కృతములోఁ 'కుమారసంభవ' మున్నది. కుమారస్వామి పుట్టుటకు జరిగిన పూర్వకథయే దానిలోని ప్రధానకథ ఆ పూర్వ కథలోని భిన్నాంశము లనుస్యూతముగాఁ జెప్పఁ బడుటమాత్రమే యందు జరిగినది. ఈ స్వారోచిషమను వుదయించుటకుఁ బూర్వము జరిగిన కథలే యిందును జెప్పఁ బడినవి. కాని అక్కడ నేదృష్టితోఁ జెప్పఁబడినది? ఇక్కడ నే దృష్టితోఁ జెప్పఁబడినది ? ఇక్కడఁ జెప్పఁబడిన దృష్టి

పరిశీలించి, తదనుకూలమైన భిన్నవస్తుగ్రథనకౌశలము పరిశీలించినచో, నిది మహా కావ్యమని తెలియఁగలదు.

ఈ స్వారోచిషుఁడు మనువు. మనువులు పదునలువురు. మన పూర్వులు అనంత కాలమును విభజించుటలోఁ గొన్ని లక్షల సంవత్సరములకు మన్వంతరమని పేరు పెట్టిరి. ఆ మన్వంతరకాలము, ఆ మనువు యొక్క శాసనము చేత బద్ధమై నడచుచున్నది. ఆ మనుస్మృతి ననుసరించి, ఆ మన్వంతరమున భారత దేశములోని మానవుల ప్రవర్తన నిర్ణీతమగు చున్నది భారతదేశమునం దొక విశిష్టమైన నాగరకత కలదు. అది వైదికమైన నాగరకత. ఈ నాగరకతా స్వరూపము నాచరణ దశయందు నిర్ణయించినవారు మనువులు. మను స్మృతికి ఉన్నంత ప్రాధాన్యము వేదాదులకు లేదు. సిద్ధాంతము, ఆచరణము - ఆచరణమున కున్న ప్రాధాన్యము సిద్ధాంతమున కున్నదో, లేదో! ఆచరణలోననే ఆ సిద్ధాంతముయొక్క గొప్పదనము తెలియవలయును. ఇది మనువులయొక్క వైశిష్ట్యము.

మనువు లెందుకు జన్మింతురు? మానవలోకము యొక్క నడవడి తీర్చిదిద్దుటకు. ఈ నడవడిని దీర్చిదిద్దుట వలనఁ బ్రయోజన మేమి? నడవడి నెందుకుఁ దీర్చి దిద్దవలయును? మానవుఁడు యథేచ్ఛగా నెందుకుఁ బ్రవర్తించ రాదు? ఎందుకుఁ బ్రవర్తించరాదో, ఎందుకు దీర్చి దిద్దవలయునో, మానవుఁ డనగా నేమి యని ప్రశ్నించినచోఁ దేలవలయును.

మానవుఁ డనఁగా నింద్రియముల సంపుటి. ఇష్టానిష్ట ముల సమాహారము. శరీరధారి. కామ క్రోధాదుల యాట పట్టు. జనన మరణముల ఆద్యంతసంయోగస్థానము. మానవుఁ డనఁగా నింతియమైనచో నడవడి తీర్చిదిద్దనక్కఱ లేదు. ఇంతకంటె నధికమైనచో వాని కీధర్మశాస్త్రము కావ లయును. ఆయధికమని నిర్ణయించుట యెట్లు? ఇది వేదాంతము.

ప్రతి మానవ శరీరమునందును జీవుఁడని యొకఁ డున్నాఁడు. ఆ జీవుని లక్షణము లెట్టివి? వాఁడు బహుశరీర ములయందు సంచారము చేయుచుండును. వాఁ డొక చోటి నుండి బయలుదేరినాఁడు. వాని గమ్యస్థానమును జేరుట కెట్లట్లు ప్రవర్తించవలయును? ఒక యూరినుండి మఱొక యూరికిఁ బోవుచుండఁగాఁ గొంతదూరము పోయిన తర్వాత కుడివైపునకుఁ దిరుగ వలయును. అచ్చట రెండు దారులు చీలును కుడి దారిని బట్టి పోవలయును. శ్రమ మైనచో నచ్చట నొక బావి కలదు. మంచితీర్థముఁ బుచ్చుకొన వచ్చును. అచ్చట నొక తోట యున్నది. దానిలో విశ్ర మించవచ్చును. అట నుండి మరల నెడమ వైపునకుఁ బోవల యును. అక్కడఁ జెఱు వున్నది. ఆచెఱువును జుట్టి పోవల యును. చెఱువులోనుండి పోయినచో దగ్గరే కాని, యెట్లు పోఁగలఁడు? ఇట్టి సూచనలచేత, నా మార్గమునందట్లు వెళ్ళుటచేత, గమ్యమైన గ్రామముపోఁగలఁడు. అట్లే మానవ జీవితము. జీవుని ప్రయాణము.

లోకమునందు మానవుడు మఱియొక గ్రామమునకుఁ బోవుటకు ఈ మార్గమును దెలిసికొనుట యెట్టిదో, భారత

దేశీయులు మను ధర్మశాస్త్రము నెఱుఁగుట యట్టిది. సనాతనమతస్థులకు జీవుఁడు, పూర్వ జన్మము, ఉత్తర జన్మలు, పరలోకములు, ధర్మా ధర్మములు, పుణ్యా పుణ్యములు - ఇవి యన్నియు నున్నవి. కనుక వేదశాస్త్రములు, స్మృతులు నన్నియు నీ మార్గమునే ప్రస్తరించినవి.

ఈ మహా ప్రస్థానమునందు మనువులు తమ మన్వంతరములయందు మానవుల నడవడిని దీర్చిదిద్దుటకు స్మృతులు వ్రాసిరి.

ఇప్పుడు వైవస్వత మన్వంతరము. మనమనుస్మృతి వైవస్వత మనువు వ్రాసినది.

ఈ గ్రంథము స్వారోచిషమనుసంభవము. ఆ మనుస్మృతి యెట్టిదో మనకుఁ దెలియదు. తత్తత్కాలములయందు నాచారభేదము లుండవచ్చును. కాని భారతదేశమునందుఁ బుట్టెడు మానవులయొక్క నాగరకత వేదసంబంధియైనది. కనుక మనువు లందరియందు నొక మహా లక్షణము సామాన్యముగా నుండును. కించిద్భేదములతో సృష్ట్యాది నుండి భారతదేశజాతమానవనాగరకత యొక్కటియే.

తక్కిన పదుముగ్గురు మనువులు మహర్షులు కాని, సూర్యుఁడు, స్వాయంభువు - వారినుండి పుట్టినవారు కాని, యగుచున్నారు. స్వారోచిష మను వొక్కఁడే వారి కంటె భిన్నుఁడు. ఇతఁడు జన్మించిన తర్వాత తపస్సు చేసినవాఁడు. ఎవనికో రాజునకుఁ బుట్టినవాఁడు. ఇతనియందు సూర్య తేజస్సు నిండియుండలేదు. ఇతనియందు బ్రహ్మ తేజస్సు నిండి యుండలేదు. ఇతఁడు మను వగుటకుఁ దపస్సు చేసి

నాఁడు. ఇతనిజన్మవృత్తాంతము వేఱు. తక్కిన మనువుల జన్మవృత్తాంతములు వేఱు.

పెద్దన్నగారివిచారణ ఇచ్చట ప్రారంభించినది. సామాన్య సంసారులకుఁబుట్టినవాఁడు తపస్సుచేసి మనువు కావచ్చును. మనువు కాఁదగుటకు వానియందు శక్తియుండవలయును గదా! లోకమునందు చాలమంది యధికారమును బొందుదురు. లౌకిక కారణములచేత వారికా యధికారమువచ్చును. తదధికార నిర్వాహణమునకు వారియందు సహజమైనశక్తియుండదు; వారాయధికారమును బూని తమచుట్టాలకు ప్రత్యేకత లెత్తుదురు; చిన్నిచిన్నికోపములుపెట్టుకొని సహజగుణవంతు నణఁగఁద్రొక్కుదురు. తాము కామక్రోధముల కంగడు లగుదురు. అధికారము నిర్వహించుటకు న్యాయము ధర్మము కావలయును మానవక్షేమము, దేశక్షేమము వానిబుద్ధి యందుఁ బ్రధానస్థాన మాక్రమించవలయును ఈ ఆంతర లక్షణములుకలవాఁడధికారి. కాని, బాహిరములైన పరీక్షల యందు తీర్ణుఁడగుటయో, పలుకుబడికలిమియో, యధికార మునకు యోగ్యత సంపాదించునవి కావు.

తపస్సు బాహిరమైనలక్షణము. అది పరీక్షయందు తీర్ణతపొందుటవంటిదికాని, అధికారికి ఈ ఆంతర బాహిరలక్షణములు రెండును గావలయును. వాఁడధికారి కొందఱధికారులకు నీ యుత్తమములైన యాంతరలక్షణములు సహజముగా నుండును. వాఁ డధికారియయినపుడు జనులందఱు వానినిపొగడుట మనము చూచుచునేయున్నాము

తక్కిన పదుముగ్గురుమనువులు సహజముగా మనువు నకుఁగావలసిన జీవలక్షణములు బహుపూర్వజన్మతపశ్శక్తి వలన, దైవ తేజస్సన్నిహితత్వమువలన కలిగినవారే. ఈస్వారోచిషమనువునకు నట్టి యాంతర మహాశక్తి యెట్లుకలిగినది ?

ఆశక్తియెట్టిది? మనువెవఁడు ? అతఁడు సర్వమానవ కోటియొక్క నడవడిక తీర్చిదిద్దెడువాఁడు. ఆనడవడిని సూత్రించెడువాఁడు. ఆనడవడి భారతదేశమునందలి పరమోదాత్తమైన, వైదికమార్గనిర్ణీతమైన, యొక మహానాగరకత స్థాపించి, తన్మార్గగాములైనజీవులకు నుత్తమలోకప్రాప్తి కలిగించుట కేర్పడిన నడవడి. ఇట్టిస్మృతిని వ్రాయఁగలిగిన వాని కీసర్వజ్ఞానము ఉండవలయును. తక్కిన పదునువ్వురు మనువులు మహర్షులు. దైవాంశసంభూతులు. ఈభారతదేశ మానవకోటి మనికి నాదిలోనిర్ణయించిన దేవతలు. వారికది సహజసిద్ధము. ఈ స్వారోచిషునకట్లుకాదు.

మనువనఁగా నతఁడును మనుష్యుఁడే. కానిచో దేవతా లక్షణములుకలవాఁడు. ఆకృతి మానవునిదే. మన వేదాంతము లలోనున్న చమత్కారమిది. మానవులేకాదు, దేవతలును జీవులే. ఋషులునుజీవులే. బ్రహ్మవిష్ణుమహేశ్వరులుకూడ జీవ లక్షణముకలవారే. ఆయాజీవలక్షణములయందు నుత్తమమధ్య మాధమతలుకలవు. కనుక నీసర్వసృష్టికి మూలభూతమైనది జీవలక్షణము. ఉత్తమజీవుఁడు తక్కినజీవులను బరిపాలించును. ఆజీవునకుఁ దక్కినజీవులను బరిపాలించుటకుఁదగిన శక్తియుండ వలయును. ఆశక్తి ఆజీవసంస్కారములోనుండును.

ఇప్పుడు పెద్దన్నగారు స్వారోచిషమనుసంభవము వ్రాయుచుండఁగా, స్వారోచిషుఁడు మనువగుటకుతరువాత తపస్సుచేయఁగా, ఈస్వారోచిషుని జీవునియందు మానవ కోటికి స్మృతివ్రాయఁదగిన, మానవకోటియొక్క యైహికాము ష్మికములను బరిపాలించఁదగిన లక్షణములుండవలయును.

ఈలక్షణము లెట్లుండవలయును? అనఁగా ఆజీవుని స్వరూపమెట్టిది? జీవులు పూర్వశరీరమువదలి పరశరీరమును స్వీకరింతురు. ఈమధ్యకాలమున జీవుఁడెట్లుండును? పూర్వ కర్మఫలితములను పరజన్మయందనుభవించును. వానివివేకము, వానిచదువు, వానియాకారవిశేషముదగ్గరనుండి పూర్వకర్మా పతితములగుచున్నవి. కనుక ఆనడిమికాలమున నేతత్సర్వ సంస్కారములు జీవునియందు పరమసూక్ష్మభూతములై యుండును. అందుకనియే 'తదంతరప్రతిపత్తౌ రంహతి సంప రిష్వక్తః' అని భగవంతుఁడైన వ్యాసమహర్షి వ్రాసినాఁడు. ఆజీవునియం దాలక్షణము లన్నియు నుండును. అది జీవ సంస్కారము.

ఆలక్షణము లెట్లు వచ్చును? ఆలక్షణము లెక్కడివి? స్థూలముగా నాలక్షణములు రెండువిధములుగా వచ్చును. సూక్ష్మముగాఁ జూచినచో రెండులక్షణము లొక్కటియేకాని భేద మున్నది మొదటిలక్షణము, వాఁడు చేసిన పుణ్య పాపములయొక్క సమ్మేళనము, రెండవది పితృపైతామహ మైన గుణముల సంపుటి. ఇది యాశ్చర్యము. మానవుఁడును తనతల్లిదండ్రుల కడుపున యాదృచ్ఛికముగాఁ బుట్టుటలేదు. స్వకర్మానురూపమైన తనపూర్వపుణ్యముల కనుసంధించిన

చోటనే పుట్టుచున్నాఁడు. అనగా పితృపైతామహమైన గుణములయొక్క ఫలము వీఁడనుభవించుట వీనిపూర్వకర్మయొక్క ఫలితమై యున్నది. అందుచేత వాఁడాతల్లిదండ్రులకడుపుననే పుట్టుచున్నాఁడు. ఆతల్లిదండ్రుల గుణములు వాని జీవ సంపుటిలో జేరుచున్నవి. దీనినే రెండువిధములుగాఁ జెప్పవచ్చును. వానికర్మ ఈతల్లిదండ్రులకడుపుననే పుట్టి వారిగుణములు, వారియాస్తిపాస్తులు, వారివ్యాధులుకూడ వాఁడనుభవించవలసియుండుట. రెండవదృష్టితో జూచినచో నీతల్లిదండ్రుల ఈగుణదోషములు వానియందు సంక్రమించినట్లు కన్పించుట, ఆరెండుప్రవాహము లచ్చటఁ గలియును. ఆకలియుట కర్మాపతితము. ఈ జీవునియొక్క సంస్కారమెట్టిది? అని మనము విచారించినచో, ఆతల్లిదండ్రుల లక్షణములను విచారించినచో నదియు నిదియు నొక్కటియే యగును. తరువాత వీఁడు వేఱే తనయాధ్యాత్మికప్రవృత్తి వలనఁ గ్రొత్త దేదో సాధించవచ్చును సాధించిన క్రొత్తవిషయము వాని యాధ్యాత్మికప్రవృత్తికిఁ దోడ్పడును జీవనిహిత లక్షణము తనమానవజన్మనడవడికి తోడ్పడును. వానినడక దాని ననుసరించి యుండును.

ఈస్వారోచిషుఁడు మనువు కావలయును. మనువునకేలక్షణము లుండవలయును? వాఁడేపని చేయునోఆపనికి కావలసిన లక్షణము లుండవలయును.

ఇతఁడు మానవధర్మశాస్త్రమును వ్రాసెను. పరమోత్తమమైన, భారతదేశగతమైన, మానవ నాగరకతాసంస్థాపన, తదాచరణ పమార్గముల ననుసరించి యుండవలయునో

అది వ్రాయుటకు, అట్లు వ్రాయదగిన శక్తి వానిజీవునియందు సంస్కారరూపమున నుండవలయును ఈమానవధర్మము లేమి ? దానియుత్తమోత్తమత యెట్టిది ?

భారతదేశమానవుఁడు చాతుర్వర్ణ్యవ్యవస్థాగతుఁడు. ఈవ్యవస్థలో సామాన్యజీవులు తా మార్జించిన పుణ్యాదుల వలన ఉత్తమోత్తమ జన్మము లెత్తుచుందురు. యోగులను, భక్తులను మినహాయించినచో తక్కిన మానవులు వర్ణవ్యవస్థా నిరూపితధర్మాచరణమువలననే ఉత్తమోత్తమవర్ణములందు జన్మింతు రని వేదశాస్త్రాదినిర్ణయము. ఈవ్యవస్థకూడ క్రమ పరిణామముచేత నుత్తమములైన పరలోకములు సాధించుట కేర్పడినది. ఈసామాన్య జీవులయొక్క సంస్కారవిశేషము లనుబట్టి యుత్తమలోకములు పొందఁగా నీవ్యవస్థారూపమైన నిచ్చెనలో పైమెట్టు బ్రాహ్మణుఁడు. ఆబ్రాహ్మణధర్మ ములు మానవజాతియొక్క పరమమైన నాగరకతాస్వరూప ముగా ఋషులు భావించిరి. ఐనను ధర్మశాస్త్రము నాల్గువర్ణ ములయొక్క లక్షణములను దీర్చిచెప్పును. పరమమైనదానిని జెప్పును. వీనినన్నింటిని జెప్పుటకుఁ గావలసిన సంస్కారము ఈమనువుయొక్క జీవసంపుటిలో నుండవలయును. అతఁడు తపశ్శాలియైనఁగాని చెప్పలేఁడు చెప్పుటకు తపస్వి కావల యును. ఆలక్షణములు జీవునియం దుండవలయును.

ఈస్వారోచిషమనువు జన్మించినంతనే-

అట్లు జనియించి స్వారోచిషాఖ్య నతఁడు శాంతిదాంతిదయాసత్య
శౌచనిరతుఁడై యకామత జిరతపం బాచరించె నచ్యుతుని
గూర్చి......'

మను వగుటకుఁ గొద్దిలో నొకయధికారి యగుటకు, ఏలక్షణములు కావలయునో యీ పద్యమునం దున్నవి. వాఁడు శాంతిదాంతి దయాసత్యశౌచనిరతుఁడు కావలయును. అకాముఁడు కావలయును. ఇట్టివాఁ డధికారము చేయుటకుఁ దగును. ధర్మ మిట్టి దని చెప్పుటకుఁ దగును. వానికి కోరికయే లేదు. వాఁడు చెప్పినధర్మము లోకహితముకొఱకు. అతఁడు దయాపరుఁడుఁగనుక.

ఇన్నిలక్షణము లుండియు అతఁడు ఏధర్మమును జెప్పుచున్నాడో ఎవరికొరకు జెప్పుచున్నాడో ఈరెండువిషయములు కావలయును. ఎవరికొఱకుఁ జెప్పుచున్నాడో వారికాధర్మములు కావలయును. ఆధర్మములయొక్క సంపూర్ణ పరిజ్ఞానము తాను కలిగియుండవలయును. ఆధ్యాత్మికవిషయములు తెలిసిన యతి శిష్యులకు వేదాంతము చెప్పవచ్చును. రాజనీతి చెప్పవలయు ననఁగా వానికి రాజనీతికూడ సమృద్ధిగా తెలిసియుండవలయును. ఇందులో నింకొక చిన్నకిటుకున్నది. వానిజీవసంపుటిలో రాజనీతి తెలిసిన లక్షణమున్నచో, వాఁడు రాజనీతి చదువకుండఁగనే శ్రవణమాత్రమునఁ దెలిసికొని, రాజనీతినిగూడ బోధించఁగలడు. ఇది చాల సూక్ష్మమైన విషయమై, మహాపురుషులయందు వ్యక్తమగుచుండును.

ఈస్వారోచిషమనువునకు పరమోత్తమమానవధర్మ పరిపాలనాసమర్థమైన జీవశక్తి సంస్కారరూపముగా నతనిజీవ సంపుటిలో నున్నదని నిరూపించుటకు ఈస్వారోచిషమను సంభవము వ్రాయఁబడినది. ఈకావ్యముయొక్క పరమప్రయో

జన మది. ఏకవాక్యతాగతమైన ఈమహాకావ్యముయొక్క పరమశిల్పము తదభిముఖముగా నడచినది.

ఆలక్షణము లేవి? వాని నెట్లు పెద్దన్నగారు సంయోజనపఱచినారు! స్వారోచియొక్క- తండ్రి, తాత - వారిద్దరి కథలయందు ఈలక్షణము లుండవలయును. ఆలక్షణములు ఆతండ్రితాతల జీవసంపుటిగతమైన గుణములు. ఆగుణములే సంతానమునందు సంక్రమించును. జీవుడు బ్రతుకుచున్నప్పుడు బహువిషయములయొక్క యనుభూతి జరుగును. ఆయనుభూతి యంతయు పరమసూక్ష్మరూపమున జీవునియందు నిలుచును.

ముందు తల్లక్షణములు విచారించి, తత్సంక్రమణ మార్గము పేర్కొందును.

బ్రాహ్మణధర్మ ముత్తమమైనచో వాఁడు భాషాపరశేష భోగి, వివిధాధ్వరదీక్షాపరతంత్రుఁడు, అధ్యయనాధ్యాపన నిరతుఁడు. వాఁడును, వానిభార్యయు పార్వతీపరమేశ్వరుల వంటివారు. వానిని రాజు పోషించును. మాన్యము లిచ్చును. ఇతఁడు పోయి యాచించఁడు. ఏరా ఇచ్చినను సాలగ్రామము నైన స్వీకరించఁడు. ఇవి బ్రాహ్మణునకుఁ గావలసిన లక్షణములు. వీనిలోఁ బ్రధానమైనది 'భాషాపరశేషభోగి' యనుట. అనఁగా వ్యాకరణశాస్త్రమును దెలిసియుండుట. అనఁగా మానవునియొక్క వాక్స్వరూపము తెలిసికొనియుండుట. ఉచితమైన వాక్కేది? ధర్మమైన వాక్కేది? శాశ్వతమైన వాక్కేది? ఇది మనువునకుఁ గావలసిన ప్రధానలక్షణము. వాగ్వ్యవహారము లేక లోకము ప్రవర్తించదు. ఆవాక్కునకుఁ బరమశాసకుఁడు పతంజలి. ఆలక్షణము ప్రవరునిజీవుని

యందు నిండియున్నది. ఆ ప్రవరుఁడు వట్టి వైదికుఁడే కాదు. వట్టి యప్రతిగ్రహీతయే కాదు. మానవకోటి యుత్తమలోక ములకుఁ బోవుటకుఁ బ్రధానమైన తీర్థదర్శనాదిలక్షణము జీవునియందు నిండియున్నవాఁడు. ఉత్తమగృహస్థు భారత దేశవాసులకు పరమోత్తమగృహస్థధర్మమైన అతిథిపూజ తెలిసినవాఁడు. గొప్ప లోకజ్ఞుఁడు. వాక్చమత్కృతి కల వాఁడు. భారతశాస్త్రాది విద్యలను జూచి వానిమేలిమి గ్రహిం చినవాడు. అందులో రంభాదులతోఁగూడ స్పర్థ వహించి గెలువఁగలిగిన నాట్యకర్త్రుల నాట్య మెఱింగినవాఁడు, వారి యందుఁ గామన లేనివాఁడు. పరమాగ్నిహోత్రి, అతఁ డగ్నిహోత్రి యనుటలో నొకచమత్కార మున్నది. ఈభార తీయ నాగరకత యగ్నిహోత్రము నాశ్రయించిన నాగరకత, 'అగ్ని మీాలే పురోహితమ్' మొదటిబుక్కులోని మొదటి మాట. ఈఅగ్నియొక్క స్వరూపము గహనమైనది. దీని రహస్య మంతయు పంచాగ్నివిద్యయందు నిండి నిబిడీకృతమై యున్నది. దీనినిగుఱించి యెంతయో చెప్పవలయును. అది వేఱువిషయము.

కాని ఈప్రవరుడు అగ్నిచిత్తు. ఎంతటి యగ్నిచిత్తు!

'దానజపాగ్నిహోత్రపరతంత్రుడ నేని' అన్నపద్య ములోఁ జూడనగును.

"అగ్ని దేవుం డమ్మహీదేవుదేహమ్మున సన్నిహితుం డగుటయు నమ్మహాభాగుండు గందుమీాఱి పాదపుఁగొండ ... పావకప్రసాదలబ్ధంబగు పవనజవంబున నిజమందిరంబున కరిగె."

అగ్ని దేవుఁ డతని దేహమున సన్నిహితుఁ డై నాడు. అతనికి వాయుజవము వచ్చినది. ఇంటికి వెళ్ళిపోయినాఁడు. ఇది మనువు కాదగినవానిజీవసంపుటిలో నుండఁదగిన మహా లక్షణము, వానితాతగారుగా చెప్పఁదగిన ఈ ప్రవరునిలో నున్నది. ఇది ప్రవరుని జీవసంపుటి. మానవధర్మశాస్త్రము నకు మూలభూతమైన, ప్రధాన స్తంభమైన బ్రాహ్మణధర్మ లక్షణములన్నియు ప్రవరునియం దుండి, వాని జీవసంపుటియం దుంసి, యిది స్వారోచియందు సంక్రమించి, స్వారోచిమ మనువుయొక్క జీవసంపుటిలో జేరినవి. ఇది మొదటి లక్షణము.

ఈరీతిగా మనువునకుఁ గావలసిన ప్రథమలక్షణము ప్రవరునియందు నిహితమై యున్నది. మనువులు వట్టి ఋషులు కారు. వారియందు దేవతాంశకూడ నుంశవలయును. సృష్ట్యాది మానవలోకమును దేవతాంశకలవారే తీర్చిరి. దేవతాంశ లేనివా రీతీర్పునకుఁ దగరు.

ఈమనువునందు దేవతాంశ ద్విధా సంయోజింపఁ బడినది. తల్లి దేవతాస్త్రీయైన అప్సరస, తండ్రి దేవయోని విశేషమైన గంధర్వుఁడు. వెనుకటివ్యాసములో నుదాహ రింపఁబడిన "మున్ను విప్రాకారమునఁ గూడుచో"నన్న పద్య ములోని "తత్ప్రివర దేహసమిద్ధశిఖిదీప్తి శాంబరీమహిమచే సంగ్రహించి"న ఆ గంధర్వుని సంయోగసమయమునందు 'చలన మేదిన' వరూధినియొక్క 'మానసాబ్జమున' ఆశిఖి దీప్తి నిలిచి, 'తేజోమయంబై నవృద్ధి' నందినది. పరమ

రహస్య మంతయుం బెద్దన్నగా రీపద్యమునం దిమిడించినారు. గర్భధారణము జరిగినది గంధర్వునివలన. ఆ మెనిశ్చలమైన మనస్సులో నున్నది "ప్రవరదేహసమిద్ధ శిఖదీప్తి." జన్మించు శిశువుయొక్క శరీరము దేవతాలక్షణములు కలది, లోని జీవుండు ప్రవరలక్షణములు కలవాండు. ఆ ప్రవరుని ప్రధాన లక్షణము 'శిఖదీప్తి'. కలుగంబోవు శిశువుయొక్క లక్షణ మెట్టిది ? వాండు దేవయోనివిశేషమే. కాని మనస్సు పరమోత్తమమైన బ్రాహ్మణలక్షణములు కలది. ఈ రెండును మనువునకుం గావలయును. వాండు దేవతయై యుండవలయును. సర్వమానవధర్మములయొక్క పరిజ్ఞానము కలిగినవాండై యుండవలయును. ఈ రెండును వారిగర్భమున జన్మించిన స్వారోచియందుం గలవు.

ఇప్పటికి దేవతాంశ, అగ్నిహోత్రిలక్షణము వాఙ్నియంతృత్వలక్షణమైన భాషాఽపరశేష భోగిత, అప్రగ్రహీతత్వము, గృహస్థుయొక్క పరమలక్షణమైన అతిథిసత్కారభావము, తీర్థయాత్రాకౌతుకము మొదలైన మానవకోటియొక్క లక్షణములు స్వారోచియొక్క జీవునియందు సంపుటీకరింపంబడినవి. మానవక్షేమమునకుం గావలసినవి వీనికంటె మఱియునుగలవు. మానవజాతి ఒక్క బ్రాహ్మణులే కాదు, క్షత్రియులు కలరు, తదితరవర్ణములవారు కలరు, భిన్నవర్ణస్థులకు, భిన్నభిన్నధర్మములతోంబాటు సర్వమానవజాతికి – అనంగా శరీరధారులకు సమానములైన కొన్నిలక్షణములు కలవు. వాని

నన్నింటిని బరిపాలించుటకు, వానినన్నింటిని శాసించుటకుఁ దగిన జీవసంస్కారము మనువునందు సమకూడియుండ వలయును.

స్వరోచి మృగయాకౌతుకముకలవాఁడు. ఇది రాజ లక్షణము – అతఁడు ధనుర్విద్యాపారంగతుఁడు. అది రాజ లక్షణము. అతడు బహుస్త్రీప్రియుడు. ఇదియు రాజలక్షణము. అతఁడు శరణాగతరక్షకుఁడు. ఇదియు రాజలక్షణము.

మనోరమ స్వరోచికి 'అస్త్రహృదయ' మన్న విద్య నెచ్చెను. అది సకలరిపునాశకము, యశస్కరము. మనోరమ చెలికత్తెలలో నొకతె విభావసి. మృగపక్షిజాతులభాషల నెఱుఁగు విద్యను స్వరోచి కిచ్చెను. రెండవయామె కళావతి. పద్మిని యనువిద్య నిచ్చెను – దానివలన నభీష్టసౌఖ్యములు సిద్ధించును. ఇవియన్నియు మానవజాతికోర్కెలు. ఈకోర్కె లన్నియు విద్యలచేత ఫలించును. కోర్కె లుండి యేమి లాభము? ఫలించవలయును. ఊరకే ఫలించవుకదా! ఈఫలితములు, దివ్యమంత్రములచేత సాధ్యములు. ఆమంత్రములు తపశ్శాలురకు వశంవదములు. ఇది యీదేశపు నాగరికత. ఇది యీదేశములోని మతము. దీనిసర్వస్వరూపము రాశీభూతమై, సూక్ష్మమై స్వరోచిజీవసంపుటియందు సంస్కారరూపముగా నిస్సంశయముగా భాసించును. పతంజలిమహర్షిని గుఱించి యొకమాట చెప్పుదురు.

ఆయన వ్యాకరణశాస్త్రము వ్రాసి మానవజాతి యొక్క వాక్కును పరిశుద్ధము చేసెను. యోగశాస్త్రము వ్రాసి మనోదోషములను బరిహరించెను. చరకము లిఖించి

శరీరరుగ్మతలను నివారించెను. మానవజాతికి ఈమూడు దోష ములు నిత్యసన్నిహితములు. మానవుని బ్రతు కంతయు శరీర వాఙ్మనోగతమైనదే కదా !

ఇప్పుడింతవఱకు జన్మించఁబోవు మనువుయొక్క జీవసంపుటిలో వేదములు, అగ్నులు, కోరికలు, మంత్రములు- బ్రాహ్మణ, క్షత్రియాదుల ధర్మములు సర్వమును సంస్కార రూపమున నుండుటకుఁ దగిన పరిస్థితులన్నియుఁ గల్పింపఁ బడినవి. మానవునియొక్క భారతదేశగతమానవులయొక్క మనస్సంపుటియొక్క సర్వస్వరూపము భద్రపఱుపఁబడినది. మిగిలినది శరీరవిషయము.

ఈశరీరమున రెండు ప్రధానములు. మొదటిది : వ్యాధి శరీరమునకు సహజము. దీనిని నివారించుకొనుట యెట్లనునది. రెండవది : శరీరమును పోషించుకొనవలయును. ఈశరీరమున కాహారము కావలయును. ఇది.

ఈరెంటిలో మొదటిది రెండవదిగా, రెండవది మొద టిదిగా కన్పింపవచ్చును. కాని యట్లు కాదు. జన్మ యెత్తి నంతనే యేదో యొక యుపాయముచేత మానవుఁడు బ్రతుకు చునే యున్నాఁడు. వ్యాధిని పరిహారించుకొను టెట్లా ? అన్నదియే యధికప్రయత్నము. ఎట్లో అట్లు బ్రతుకుట సహ జము. దానికిఁగూడఁ బ్రయత్నమున్నను మొదటిదైన వ్యాధి నివారణము నందలి ప్రయత్నమువంటిది కాదు. అందుచేత వ్యాధినివారణోపాయమైన, 'యాయుర్వేదశాస్త్రము' ను మనోరమతంత్రిడైన యిందీవరాక్షుఁడు స్వరోచి కుపదేశిం

చెను. ఇంక మిగిలినది మానవుఁడు బ్రతుకుట యెట్లన్నది. 'ఆయు రన్నం ప్రయచ్ఛతి.' మానవునిజన్మ యెంత సహజమో, వానికిఁ దిండి సమకూరుట అంత సహజము. వాని కర్మవశమునఁ దిండికి లేనిచో వాఁడు చనిపోవును. బ్రతుకుటయును, దినుటయును సమస్కంధమునందుఁ గలవు. ఇది జాగ్రత్తగాఁ బరిశీలించవలసిన విషయము. తర్కమునందు బెసకిన బుద్ధితో నిది సమన్వయించదు. మానవజాతియాహారము కొఱకు మానవుఁడు నేలను దున్ని వచ్చెడు సస్యముమీఁద తరువాత నాధారపడసాగెను. తొలుతటిది ధారుణీసహజ సస్యము. అది కాంతారజము, వనజము ఈస్వారోచికి ఆస్వారోచిషమనువు జన్మించినది వనదేవతాగర్భమునందు. ఈసంఘటనయం దారహస్య మిమిడింపఁబడియున్నది.

ఈరీతిగా మనువుయొక్క జీవసంపుటియం దుండవలసిన లక్షణము లన్నియుఁ బ్రవరగంధర్వులనుండి సంక్రమించిన లక్షణములతో స్వారోచిజీవసంపుటిలో పరిణతమై వికసనాభిముఖమై యున్నవి.

ఇంక మిగిలిన దొక్కఁటే కలదు జన్మ యెత్తినంతనే పురుషునకు బహుస్త్రీగతవాంఛ సహజముగా నున్నది. ఇచట పురుషుఁ డన్నది లక్షకశబ్దము

జీవుఁడు జీవుఁడుగా నెందు కయినాఁడు? బ్రహ్మచైతన్యమైన తాను 'బహు స్యాం ప్రజాయై' అన్న సంకల్పముచేత నైనాఁడని వేదాంతములు చెప్పినను, మాయావిహితుఁ డగుటచేత నైనాఁడు. ఈమాయాస్వరూప మెట్టిది? ఏకరూపుఁడైన తాను బహురూపుఁడుగాఁ గావలె నన్నట్టిది.

తన బహురూపకల్పన పురుషుఁడు స్త్రీద్వారా చేసికొనఁ గలఁడు. స్త్రీద్వారా యనఁగా, స్త్రీగతమహామోహముచేత.

ఇట్లు జీవుడు నిరంతరప్రసవణశీలుఁడై యెచ్చటికిఁ బోవును ? ఏమి యగును ? ఈజీవునకు ముక్తి యెప్పుడు ? తా నేకరూపుఁడనని తెలిసినప్పుడు. ఆ తెలిసికొనుటకు మార్గ మేది ? నియమము. ఆనియమము నభ్యసింపవలయును. నిత్య కామప్రవాహలగ్నుఁడైన జీవుఁడు తనఏకరూపకోపాసన తొలి మెట్టు ఏకస్త్రీగతవాంఛాగతుఁ డగుట. ఇది ధర్మశాస్త్రము ప్రాయు మనువుపరమోత్తమనాగరకతకు - నాగరకత యనఁగా నియమము. నియమముచేత దన్నుదాఁ దెలిసి కొనుట, నియమముచేత లోకవాంఛావాగురులనుండి తప్పించు కొనుట - పునాది వేయవలయును. ఆపునాది వేయుటకు మనువై జన్మించినవాని జీవసంపుటియందు తల్లక్షణము సంస్కారరూపముగా నుండవలయునుగదా ! ఈసంస్కారము కూడ స్వరోచికిఁ గలుగవలయును. ఇందుకై ఈమనుచరి త్రమునం దొకయుపాఖ్యానము కలదు.

ఆయుపాఖ్యానములోఁ దనభార్యలతో విహరించు స్వరోచినిజూచి ఒకహంసయు, నొకచక్రవాకియుఁ బ్రసంగించు కొన్నవి. హంసి ఆముగ్గురుస్త్రీలయు, స్వరోచియు నడుమనున్న ప్రేమను ప్రశంసించెను. చక్రవాకి తిరస్కరించెను. చక్ర వాకి: 'తగులు నెవ్వఁడొక్కతరుణికి, నొకనికి మెలఁత వలచు నదియు మే లనంగవచ్చుఁగాని పెక్కువనితలపైఁ గూర్మి కలుగుననుట బొంకు కాదె తరుణి.' మఱియు 'ఇతఁ డొక

లేమం దా నెలమిఁ గూడునెడ నేమానిని ప్రాణేశుమీఁది మమత మెలంగుకా !' అనెను,

పశుపక్షిజాతులభావ మెఱిఁగిన స్వారోచి కీమాటలు తెలిసెను. సిగ్గుపడెను.

"తల వాంచి యుస్సురని మది తలపోసె"ను. కాని మానరాని తమకంబున నానెలంతలతో నుండెను.

ఇది రహస్యము. స్వారోచిజీవసంపుటియందుఁ బుట్ట బోవు మనువుయొక్క పరమసంస్కార మంతయుఁ గలిగి యున్నదిగాని, స్వారోచి కాపరిణతి లేదు.

ఇట్లు వనదేవతకు, స్వారోచికి స్వారోచిషుఁడు జన్మించెను. ఆజీవునిలక్షణము వేఱు. అతఁడు పుట్టినంతనే శాంతి దాంతిదయాసత్యశౌచనిరతుఁడై యకామతఁ జిరతపం బాచరించెను. ఆజీవుఁడు పండినవాఁడు. మను వగుటకు నీస్వారోచి ప్రవరగంధర్వుల సంస్కారియాసంపుటి యంతయు నతనిజీవ సంపుటిలో నిక్షిప్తము కావలయును. అయినది. మను వైనాఁడు. అతనిపేర నొకమన్వంతరము వెలసినది. అతఁడు రచించిన స్మృతి అతనిమన్వంతరమునఁ బ్రకాశించినది.

ఇది స్వారోచిషమనుసంభవకథ. ఇది ఏకవాక్యత సాధించిన శిల్పములోని పరమమైన లోతు.

ఇట్లు తనకావ్యకథను పరమనిగూఢమైన యభిప్రాయములతో సంతరించఁగలిగినవాఁడు మహాకవి. ఇది కావ్య శిల్పముయొక్క పరమస్వరూపము. కథ, కథాకథనవైఖరి, మొదలైనవి దీనికంటె తక్కువవి. కాని అవి లేనిచో నింత

శిల్పము వృథా. ఇది లేనిచోఁ దక్కినవాని కౌత్కృష్ట్యము లేదు.

పెద్దన్నగారి తక్కినవిషయములయందలి పారావారీణత మఱియుఁ గొన్నివ్యాసములలో నిరూపింతును.

## 3

పెద్దన్నగారు తమరచనాశక్తి యంతయు ప్రవరుని కథలోఁ గుప్పించి వదలిపెట్టినా రనుట సందేహము లేదు. కథను వ్రాయుటలో ననేకవిధములైన ప్రతిభలు చూపించ వచ్చును. ఒకటి – తనపాత్రలను తీర్చి దిద్దుట. రెండవది – ఉచితవర్ణనలు చేయుట, ఆవర్ణనలయందు న్యూనతాధిక్యములు లేకుండ తూచినట్లు చేసి యమరించుట. మూడవది – తాను చేసెడు పద్యరచన తద్రసభావముల కనుగుణముగా నుండుట. ఇది చాల పెద్దవిషయము. చాల క్లిష్టమైన విషయము. ఇది కవియైన ప్రతివానికిని తెలిసెడిది కాదు. ఒక పని తెలిసి చేయుట, తెలియకుండ చేయుట – అని రెండున్నవికదా! ఒకఁ డొకపనిని తెలియకుండఁ జేసెను అది బాగుగనే యున్నది. అట్టిదానినే ఘుణాక్షరన్యాయ మందురు. పురుగు మంటిలో తిరిగినది. ఆగీత లొకయక్షరముగా రూపొందినవి. ఆపురుగున కది యక్షర మని తెలిసి గీయలేదు. అట్లు ఒకమంచిపద్యము రచనాశిల్ప మెఱుఁగని యొకకవియొక్క నోటినుండి వచ్చినచో నది యట్టిదే. ఆపురుగు గీచిన గీత లొక్కయక్షర మగునుగాని అన్నియక్షరములు గావు. ఒకశబ్ద మేర్పడదు; ఒకవాక్య మేర్పడదు. అట్లే రచనాశిల్పపరిజ్ఞాత

కాని కవియొక్క కావ్యము సర్వరమణీయముగా నుండదు. సర్వవృత్తౌచిత్యము భాసించదు. యథార్థమైన కావ్యశోభ కలుగదు. కవియైనవానికి మొట్టమొదట తెలిసికొనవలసిన విషయము రచనాశిల్పము. ఈరచనాశిల్పము సూక్ష్మముగాఁ జూచినగాని తెలియదు. తెలుఁగులోఁ గొన్నిపద్యములు ప్రవాహముగా నడుచును. దీనికి ధారాశుద్ధియని నరసభూపాలీయకర్త పేరు పెట్టెను. గురుమూర్తులు శ్రీచెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఈమాటకు పెద్దపలుకుబడియు, ప్రాధాన్యమును తెచ్చిపెట్టిరి ఈధారాశుద్ధి కలిగిన పద్యములు నోట నలుగుటకు వీ లున్నది. కావ్యగతములుకాని చాటువులందు దీధారాశుద్ధికి మంచి స్థానము కలదు. కావ్యమునం దీ ధారాశుద్ధి మాత్రమే తీసికొని, పద్యరచన చేసినచో కావ్యశోభ తగ్గిపోవును. అట్టిపద్యరచనయం దొకశోభ యుండును. దాని శోభ దానిది. సీతాశోకచిలుకవలె నలంకరించుకొను స్త్రీయొక్క సౌందర్య మాపెది. ఇల్లాల ట్లలంకరించుకొనరాదు గదా! అట్లే, కావ్యగతమైన పద్యరచనయొక్క లక్షణము వేఱు. కొందరిల్లాం డ్రలంకరించుకొందురు. ఇల్లాలితనమేమియు చెడదు. ఆరీతిగా కావ్యములందలి పద్యరచనయందు కూడ నొకానొక ధారాశుద్ధి యుండును. సర్వపద్యమునందు ధారాశుద్ధి యుండిననే పద్య మనిపించుకొనును. లేనిచో పద్యపుకూర్పు కొకిబికిగా నుండునుగదా!

ధారాశుద్ధి యనఁగా అజ్ఝల్లులకూర్పుయొక్క సాగుట ప్రధానముగాఁ గలిగిన శబ్దముల పొసగింపుచేత కలుగు నొకానొకగుణము. అర్థ ముండును. అచటనున్న భావముల కది

యుచితమా యన్న ప్రశ్న వచ్చినచో కష్ట మగును. ఒకా నొకఁడు తా నంతవాడ నింతవాఁడ నని చెప్పుకొను చున్నాఁడు. అప్పు డీధారాశుద్ధిగల పద్యము ఉచితముగా నుండును. వానిమనస్సులోనున్న యొకయాత్మస్తుతి ప్రవా హమున కిది వ్యంజకముగా నుండును కనుక. ఒకమహామంత్రి మాటలను తూచి తూచి వాడును. ఆలోచన చేసి శబ్దములు ప్రయోగించును. ఒకభావమును చెప్పి, దానితరువాత వచ్చు భావమును మరుగుపఱుచును. ఒకభావమును డొంకతిరుగు డుగాఁ జెప్పును. తనయర్థ మితరులకు తెలియకుండ నొకా నొక వాక్యము నుచ్చరించును. ఆమంత్రి చెప్పినాడన్న పద్యముకూడ నీటివలె ప్రవహింపఁజేసి ధారాశుద్ధి యన్న గుణము ప్రధానముగా రచించినచో ఆపద్యరచనయందు వ్యంజకతాలక్షణ ముండదు. వ్యంజకతాలక్షణము కలిగి యుండుటయే పద్యరచనాశిల్పలక్షణము.

ఇందులో నింకొక్కవిశేష మున్నది. లోకములో కవు లున్నారు. ప్రధానముగా తెలుఁగులో నన్నయ్యతిక్కనలను తీసికొందము. నన్నయ్యగారిలో సంస్కృతపుమాట లెక్కువ. తిక్కన్నగారిలో తెలుఁగుమాట లెక్కువ – అన్నవిమర్శన విమర్శనయే కాదు. ఆయన నోటివెంట వచ్చు మాటలు వేఱు, ఈయననోటివెంట వచ్చు మాటలు వేఱు. సంస్కృత శబ్దములైనను, ఆంధ్రశబ్దములైనను వేనికవి కేటాయింపుగానే యుండును నన్నయ్యగా మాటలలో దీర్ఘాక్షరబహుళము లైన మాట లుండును. ఏయక్షర సన్నివేశముచే మాటకు చిక్కదన మేర్పడునో, మాటలో మాధుర్యము కలుగునో

ఆశబ్దములు నన్నయ్యగారినోటినుండి వచ్చును. తదనుబంధి మాధుర్యము, తదనుబంధియైన ధార, తనపద్యమంతయు నిండియుండుటకు నన్నయ్యగారి జీవశక్తి తదనుకూలమైనది గనుక, తన్నిష్ఠమైనదిగనుక - పద్యముయొక్క భిన్నభిన్న భాగములలో, వాక్యవిన్యాసవైఖరిలో, సమాసగ్రథనప్రయత్నములో ఆభావమే దీపించుచుండును. తిక్కన్నగారినోట చిన్నచిన్నిమాటలు వచ్చును. హ్రస్వాక్షరబహుళములైన మాటలు వచ్చును. గురువు కావలసివచ్చినచో తదనంతర సంయుక్తాక్షరనిక్షేపవశమున తత్పూర్వాక్షరము గురువగు శబ్దముల బాహుళ్యమే ఆయననోటికి వచ్చును. ఆయన నోటి వెంట వచ్చు సంస్కృతశబ్దములే వేఱు. ఆశబ్దములుకూడ ఈలక్షణము కలవిగానే యుండును. ఇట్టిరచనలోగూడ నొక ధారాశుద్ధి యుండును. దానియందుగూడ ధారాశుద్ధి యుండుట తిక్కన్నగారివాక్కు కవివాక్కగుట. అనఁగా ఆయనజీవలక్షణములో కవిలక్షణ మున్న దనుట.

ఇప్పు డీరెండులక్షణములు ఈమహానుభావుల యిద్దఱి యందు విడివిడిగా, ప్రత్యేకముగా, మహారూపములు పొంది వెలుగొందుచున్నవి. ఇట్లు భిన్నముగానున్న ఈశైలీపద్ధతులలో రచనాశిల్ప ముండునా ? అన్నది ప్రశ్న ఉండును. ఆరచనాశిల్పము ఈ ప్రధానశయ్యలకు దాటినది. నన్నయ్యగారిలోనున్న రచనాశిల్పము ప్రధానమాధుర్యగుణముచేత గుర్తుపట్టుట కష్టము. తిక్కన్నగారిలోనున్న ఈరచనాశిల్పము తొందరగా కనిపించును. కనిపించు ననఁగా ఆశిల్పము యొక్క యభిజ్ఞకలవానికి తెలియునని యర్థము. తిక్కన్న

గారి రచనవంటి రచనలో మాధుర్యము తక్కువ. భావమే పాఠకుని పట్టికొని ముందునకు సాగదీయును. నన్నయ్యగారి రచనవంటి రచనలో మాధుర్యప్రవాహమే పాఠకుని ముందునకు లాగికొనిపోవును. శిల్పవిషయమున ఈమధుర రచన పాఠకుని మిక్కిలి ప్రతారించును. తిక్కన్నగారిరచన పాఠకునిబుద్ధిని శిల్పమువైపునకు మరలించును. అందుకనియే స్థూలముగా పఠించువారికి తిక్కన్న శిల్పియని, నన్నయ్య కాదని యనిపించుట. ఇక్కడ శిల్ప మనఁగా పద్యరచనాగత వైశిష్ట్యము. ఆయన వాడెడి లోకోక్తులు, నుడికారములు మొదలైనవి శిల్పమన్న బుద్ధిని కలిగించును. నిజమున కది శిల్పము కాదు. శిల్ప మన్నది వేఱేవిషయము. లోకోక్తులు, నుడికారములు మొదలైనవి ఎక్కువ వాడుటచేత ఒకపాత్ర పోషణము మిక్కిలిగా జరుగుచున్నట్లు మనస్సునకు భ్రాంతి కలుగును. దానిని శిల్ప మని తొందరలో పాఠకుఁ డను కొనును.

పెద్దన్నగారిపద్యరచనామార్గము నన్నయ్యగారిసంప్రదాయములోనిది. అందుచేత పెద్దన్నరచనలో నిగూఢముగా నున్న శిల్పము తెలిసికొనుట కష్టము. మధురపద్యరచనానుబంధివాగ్వ్యవహారమూలహేతుకవిశిష్ట జీవలక్షణము కలవారి రచన ప్రజాదరణమును పొందును. అతనిరచనలో శిల్పము లేకున్నను ప్రజారంజనము పడయును.

మఱియొకవిషయము – అట్టి మధురపద్యరచనాశక్తి గలవాని రచనలో శిల్పము సమకూర్చుకొనుట మిక్కిలి కష్టమైన విషయము. ఆకవి మాధుర్యగుణవశుఁడై అదియే శిల

మనుకొని దానివెంటఁబడి పోవును. వచ్చినకీర్తికి చట్టలు పొంగించుకొనును. మాధుర్యసౌకుమార్యగుణములు జీవలక్షణముచేత ఏకవినోటినుండి వచ్చు పద్యమునందు కుదురుకొనియుండునో, ఆకవి ఆగుణములకు వశుఁడై, సమాపతితమైన సులభకీర్తికి దాసుఁడై మహాశిల్పమార్గమునకు బాహిరుఁ డగుట సర్వథా సంభవము.

ఇంత వ్రాయుట యెందు కనఁగా పద్యరచనయందు ఇట్టిమహామాధుర్యగుణము నిత్యప్రసన్నమై యుండఁగా, పెద్దన్నగారు వంచింపఁబడలేదు. ఆయనజీవలక్షణ మింతకంటె యధికమైనది, పరమోదాత్తమైనది, సర్వశిల్పలక్షణసంగ్రహిణమైనది.

ఇంతకు ముందే వ్రాయఁబడినదిగదా! ఇట్టిరచనలోని శిల్పమును బట్టికొనుట కష్టమని. ఈచెప్పఁబడునది పద్యరచనాగతశిల్పము ఇది చెప్పుచుండఁగా కథాగతవిషయములుకూడ ప్రదీపితములు కావచ్చును.

ఈవ్యాసము తొలుత శిల్పలక్షణములు కొన్ని చెప్పుచు రచనాశిల్పము వచ్చినంతనే దానినిగూర్చి విస్తరించి చెప్పుటయైనది. కాని ఈవ్యాసములో ప్రధానముగా ఇదియే వ్రాయు విషయము.

ఆప్రధానశిల్పలక్షణములలో మిక్కిలి ప్రధానమైన దానిని చెప్పలేదు. దానిని చెప్పి మరల ఈశిల్పరచనను ప్రారంభింతును. ఆ పరమప్రధానమైన విషయము కథాకథన వైఖరీవిశేషము. దానినిగురించి వ్రాయకముందు పెద్దన్నగారిరచనలోని బహువిషయములు చెప్పినఁగాని చివరకు

సంయోజనము కుదరదు. ఈచెప్పుటలోననే తద్విషయక మైన పలుసంగతులు రావచ్చును. పాఠకుఁడు ఇవియన్నియు వ్రాసినతరువాత, సంయోజనాదృష్టితో పరిశీలించవలసి యుండును.

పెద్దన్నగారిపద్యరచనాశిల్పమునుగూర్చి విచారించు టకుపూర్వము పద్యలక్షణమునుగూర్చి విచారింపవలయును. కవి ఒకవర్ణనము చేసినప్పుడు పద్యము వ్రాయును. కథ చెప్పుచున్నప్పుడు పద్యము వ్రాయును. కథలో పాత్రలు తమభావములు చెప్పుటకు పద్యము వ్రాయును. కథాంశ ములు కలుపుచు కథను నడుపుటకు పద్యము వ్రాయును. కావ్యమంతయు పద్యమయముకదా! మనతెలుగుకావ్య ములు నన్నయ్యగారు పెట్టిన వరవడిప్రకారము భగవంతు నకో, ఒకరాజునకో, ఒకమంత్రికో యంకితము లీయబడినవి. ఆశ్వాసాద్యంతపద్యములు సర్వకావ్యములయందు సమాస భూయిష్ఠములై యుండుట యందఱకును దెలిసిన విషయమే. ఆపద్యముల కది యొకనమూనా యేర్పడినది. అట్లు వ్రాయుట యొకశిల్పము కాదు, ఆచారము. ఈదృష్టితో పద్యరచనను జూడ నారంభించినచో, పద్యరచనయందు భిన్నభిన్నలక్షణములు గోచరించును.

ఇట్టిపద్యరచనకు కావ్యరచనలో కొన్ని లక్షణము లకు కొందఱు పూర్వకవులు చూపినమార్గములు తరువాతి కవులు వరవళ్ళుగా స్వీకరించినారు. అట్టివరవళ్ళు కొన్ని పెద్దన్నగారివి కలవు. అందులో నొకటి కథారంభపద్యము సమాసభూయిష్ఠముగా వ్రాయుట. ఆయూరున్నది. ఆయూరి

కోటగోడలు ఆకాశమును ముద్దు పెట్టుకొనుచున్నవి. అది 'మహీకంఠహారతరళము' వలె నున్నది. అయగడిత పాతాళము నంటుచున్నది. ఇటువంటి భావములతో మొదటిపద్యమును వ్రాయుట. తరువాత చాతుర్వర్ణ్యము, వెలయాండ్రు, వీరివర్ణన పెద్దన్నగారు చేసిరి. తరువాతివారు పువ్వులావికలనుగూడ కలిపిరి. పెద్దన్నగారు దీర్ఘమైన సమాసములతో వచనమును వ్రాసిరి. తక్కినవారును వ్రాసిరి. ఈయన ఎందుకు వ్రాసెనో వారికి తెలియలేదు, ఇది తరువాత చెప్పఁబడును.

ప్రవరునియింటికి సిద్ధుఁడు వచ్చెను. ఇతఁడు సిద్ధుఁడు గాని యతి కాఁడు. అందులో నొక యౌషధసిద్ధుఁడు. ప్రవరుఁడు అగ్నిహోత్రి, సోమయాజి, మహాపండితుఁడు. శిష్యులకు శాస్త్రములు పాఠము చెప్పఁగలిగిన పండితుఁడు. అతఁడు తనయింటికివచ్చిన సిద్ధుని యతిని పూజించినట్లు పూజించడు. ఆసిద్ధుఁడు బ్రాహ్మణుఁడు కావచ్చును. కాకపోవచ్చును. కాని ఆసిద్ధునితో ప్రవరుఁడు పలికినపలుకులు పాఠకుని పొరవెట్టును.

"నేడు మన్మందిరము పవిత్ర మయ్యె" నని, "మీమాటలు మంత్రము"లని, "మీమెట్టినయెడ ప్రయాగ"యని, "కుటుంబజంబాలమునందు చిక్కియున్న మాదృశగృహమేధులు యుష్మదంఘ్రిరజోలేశముచేత నుద్ధరింపఁబడుదు" రని – ఇట్టిమాటలు చూచినచో ప్రవరుని యింటి కెవఁడో మహర్షి వచ్చినట్లు పాఠకులకు భ్రాంతి కలుగును. ప్రవరుఁ డభ్యాగతసేవాపరతంత్రుఁడు. ఆపారతంత్ర్యమే సకలజీవనమైనవాఁడు.

అతనిలక్షణ మది. అతనికి వచ్చినవాఁ డౌషధసిద్ధుఁ డన్నంత తెలియకపోలేదు.

'అభ్యాగత స్స్వయం విష్ణుః' అన్న ధర్మమును సంపూర్ణముగా విశ్వసించి, వచ్చినవారి నిట్లు మర్యాద చేయును ఈసంగతి తరువాతిప్రసంగమువలన తెలిసికోఁదగినది.

ఈప్రథమాశ్వాసములోని ఆయువ్వుపట్టు ప్రవరుని యొక్క తీర్థసందర్శనాభిలాష. ఈయభిలాష పట్టరానంత యున్నది ప్రవరునకు.

ఇట్లు ప్రవరుఁడు సిద్ధుని మిక్కిలి పొగడగా, ఆపొగడికను సిద్ధుఁడు ఏమహర్షియో స్వీకరించినట్లు స్వీకరించలేదు. అతఁడు గృహస్థధర్మమును పొగిడెను. ఆపొగడికి గృహమేధి, యజమానుఁడు, వాస్తవ్యుఁడు, కాపు, సంసారి, భవనభర్త, కులపతి, కుటుంబి - ఈమాటలకు విశేషణములు జోడించి చేసెను. ఎందు కిట్లు చేసెను! ఆసిద్ధుని స్వభావ మేమి! అతఁడు వలుచోట్ల తిరిగెడివాఁడు. గృహస్థులను పొగిడి, పొట్ట గడుపుకొనువాఁడు.

ప్రవరుఁడు గృహస్థధర్మముగా తన్ను పొగడెనని సిద్ధునకుఁ దెలియును సిద్ధుని యీమాటలవలన వీనిస్వరూపము ప్రవరునకుఁ దెలిసెను.

"అయ్యో మాది యే మున్నది? తమవంటి మహాత్ముల తపస్సులచేతగదా మేము బ్రతుకుచున్నాము." అని ప్రవరుఁ డనలేదు. అనవలసిన యవసరము లేదు. పైఁగా వెంటనే యాసిద్ధుని స్వరూపము గ్రహించి, మర్యాద నతిక్రమించకయు--

"మీరు సమస్తతీర్థాటనము కావింపుదురు. అందుచేత విభజించి యడుగఁ గోరికయైనది. ఏయేదేశముల వసించితిరి!" అని మొదలైన వడిగి "అచ్చటివింతలు మాకెఱిఁగింపు" మనియె.

ఈసిద్ధుఁ డింతకు మించి యెక్కువ చెప్పలేఁడని ప్రవరునకుఁ దెలియును.

ఆసిద్ధుడు :

ఓచతురాస్యవంశకల
    శోదధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జనప
    దంబులు, పుణ్యనదీనదంబులున్
జూచితి నందునందుఁగల
    చోద్యములం గనుగొంటి నావటీ
రాచలపశ్చిమాచలహి
    మాచలపూర్వదిశాచలంబులన్.

కేదారేశు భజించితిన్ శిరమునన్
    గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం
    బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీ
    నారాయణుం గంటి నీ
యాదేశం బన నేల, చూచితి సమ
    స్తాశావకాశంబులన్

ఈరెండు పద్యములు చెప్పి,

వ. అదియట్లుండె- వినుము గృహస్థరత్నంబ, లంబమానరవిరథతురంగశృంగారచారుచామరచ్ఛటాప్రేక్షణక్షణోద్గ్రీవచమర సముదయంబగు నద

యంబువంగల విశేషంబులు శేషఫణికినైన లెక్కింపఁ శక్యంబె, యంధకరిపుకంధరావాస వాసుకివియోగభవదుర్వ్యథాభోగ భోగివీభోగభాగపరివేష్టితవటీర విటపివాటికావేల్లదేలాలతా వలయంబగు మలయంబువంగల చలువకు విలువ యెయ్యది. యకటకట వికటకోటివిటంకశృంగాటకాఢౌకమానజరదిందుబింబగళదమృతబిందు దుర్నివార్ద్రీకృతవల్లికీపల్లవప్రభంజనవరాంజనహస్తిహస్తంబగు వస్తంబునంగల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జెంతించిన మేనం బులక లిప్పుడుం బొడమెడు, స్వస్వప్రవర్ధితవర్ధిష్ణుధరణీరుహసందోహదోహదప్రధానాసమానఖేలద్దైలబిలవిలాసిపీవిలాసవాచాలతులాకోటికలకలాహూయమానమానసమదాలసమరాళంబగు రజతశైలంబు నోలంబులం గాలగళవిహారప్రదేశంబులం గన్న సంస్మృతిక్లేశంబులు వాయవే. సతతమదజలస్రవణసరాయత్తైరావణవిషాణకోటిసముట్టంకితకటక పరిస్ఫురత్కుఱువిందకందళప్రాతజాతాలాతశంకాపసర్పదభ్రముభ్రమీవిభ్రమధురంధరంబగు మేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులు గలయం గమంగొనుట బహుజన్మకృత సుకృత పరిపాకంబునం గాక యేల చేకూఱునేర్చు ? నే నిట్టిమహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి.

అని పెద్దవచనమును జెప్పెను. రచనాశిల్ప మీపద్యములలో, వచనములో నున్నది.

ఆ సిద్ధునివంటివారివద్ద ప్రధానముగా రెండులక్షణము లుండును. మొదటిది – గృహస్థులను పొగడుట. రెండవది – తమగొప్పతనమును చెప్పుకొనుట.

"ఓమిహిరాంశువంశకలశోదధిపూర్ణ శశాంక" అన్న శ్రీనాథునిపద్యచరణమును దీసికొని "మిహిరాంశు" బదులు "చతురాస్య" పెట్టినాఁడు. ఇది పెద్దన్నగడుసుఁదనము. శ్రీనాథునిసంబోధనలో పద్యచరణపుకూర్పు ప్రధానముగాని విశేషము లేదు. ఇక్కడ ఈసంబోధనలో సిద్ధుని స్వభావము నకు ఇది వ్యంజక మగుటయున్నది.

తరువాత "పటీరాచలపశ్చిమాచలహిమాచలపూర్వ దిశాచలంబులన్" అన్న ఈపద్యము చివరి చరణములోని కూర్పు ఆదీర్ఘాక్షరములు, ఆనడక సర్వము సిద్ధుని 'బడాయిని' సూచించుచున్నవి.

"కేదారేశు భజించితిన్" అన్న పద్యరచనకూడ సిద్ధుని యాత్మస్తుతికి వ్యంజకముగానే యున్నది. ఈవ్యంజకత్వమునకు తరువాతి వచనము నిధి. ఆదీర్ఘసమాసములు, ఆకఠినశబ్దముల ప్రయోగము, అందులోని వృత్త్యనుప్రాస లక్షణము, చేసిన కల్పనలు — సర్వమును ఆసిద్ధునియొక్క తా నిన్నిన్నిచోట్లు చూచితినని చెప్పికొనుటలోని బడాయియు, గొప్పతనమును కనిపించుచున్నవి.

ఇది కావ్యము. నాటకమైనచో ప్రవరుం డెట్టివాఁడో సిద్ధుం డెట్లు మాటాడుచున్నాఁడో, తెలిసిన నటకులు ప్రయోగించినపుడు కనిపించునది యంతయు కావ్యము వ్రాయునప్పుడు కవి తనశబ్దప్రయోగనైపుణ్యముచేత స్ఫురింపఁ జేయును. ఆనాట్యలక్షణమంతయు వీనిపద్యరచనలోఁ జూడవలయును. ఆనాట్యలక్షణము నంతయు స్ఫురింపజేయునట్టి రచన చేసినచో దానిని వ్యంజకమైన రచన యందుము. ఈ వ్యంజకతాలక్షణము తెలిసికొనుటకు శబ్దశక్తి, పద్యరచనాగతశక్తి పాఠకునకుఁ దెలియవలయును. మొదటిపద్యములోని దీర్ఘాక్షరములవిసురు — "ఈయాదేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులన్" అన్న అతిశయోక్తి వచనముచేత వ్యంగ్య మగుచున్న వాని మాటలలోని విప్పు, తాను తాఁ జెప్పికొనుచున్న గొప్పదనము - ఇదియంతయు సువ్యక్త

మగుచున్నది. ఆసిద్ధుఁడు చెప్పినమాట లెట్లున్న వనఁగా – ప్రవరునకు నవ్వువచ్చినది పరిహాసము కల్గినది. కాని యతఁడు గొప్పపండితుఁడు. ఆత్మనియమము కలవాఁడు. అభ్యాగతుని తేలికగా నవమానించఁడు. ఎంత యవమానిం చకపోయినను –

"పెరవక మీ కొనర్తు నొకవిన్నపము ..." అని యన్నాఁడుః "ఇవి యన్నియుఁ జూచివచ్చుటకు ఏండ్లును, పూండ్లును పట్టును! మీచిన్నవయసును మీ మొగమే చెప్పక చెప్పుచున్నది. అద్దిరయ్య!" అని ఆక్షేపణ.

"మీమహిమ మీకే తెలియవలయును. మా కేమి తెలియు?" నన్నాఁడు. అనఁగా "నే నీమాటలు నమ్మ" నని యర్థము. "నీవు గప్పాలు కొట్టుచున్నా" వని యర్థము. ప్రవ రుఁడు 'అద్దిరయ్య' అన్నప్పుడు, ప్రవరుని మొగములోని యాక్షేపణము సిద్ధునకు పూర్తిగా తెలిసెను.

కాని సిద్ధుడు పదిదేశములు తిరిగినవాఁడు. ఇటువంటి వారిని వందమందిని చూచినవాఁడు. వానిగడుసుదనము వేరు. ఆతలివాఁడు తన్ను వెక్కిరించుచున్నాడని తెలిసియు, ఆకోపము మనస్సులో పెట్టుకొనియు, ఇటువంటిదేశదిమ్మ రులు మంచిగానే మాట్లాడుదురు. వారు వెక్కిరించినది తమకు తెలియనట్లుగా నటింతురు. ఆవెక్కిరింతకు తమ కను కూలమైన వ్యాఖ్యానము చేయుదురు. అందుచేత సిద్ధుఁడు ప్రవరాఖ్యుని ఈవెక్కిరింతను "సందేహము తెలియ నడు గుట" గా జమకట్టినాఁడు. అని యంతటితో నూరకుండలేదు. వీఁడు నన్ను వెక్కిరించుచున్నాడుగనుక వీనికి పరాభవము

చేయవలయు ననుకొన్నాఁడు. ప్రవరుని మోసపుచ్చ వలయును.

"మేము సిద్ధులము. మాకు జరారుజలు లేవు" అయినను,

"పరమంబైన రహస్య మా, నయిన దాపక జెప్పెదన్ భూమినిర్జరవంశోత్తమ"! అని మొదలుపెట్టినాఁడు.

ఈమాట లెట్లు చెప్పినాఁ డనఁగా ఎవరైనను విని పోదురేమో యన్నట్లు, గొంతుసవ్వడి తగ్గించి, ఇంచుమించుగా ప్రవరుని చెవిలో నోరు పెట్టి చెప్పినాఁడు. ఇంత యర్థ మీచరణములో నెట్లున్నదని యడుగవచ్చును.

"పరమంబైన రహస్యము" అని మత్తేభ మెందుకెత్తవలయును? "పరమరహస్యమైనదియుఁ బాయక చెప్పెద" నని యెందుకనరాదు? ఈ చంపకమాల తేలికగదా! కాని మత్తేభమునే యెత్తినాఁడు. ఎందుకనఁగా 'పరమరహస్య' మన్నచో 'పరమంబైన రహస్య' మన్నదానిలోని 'ఐన' అన్నమాట యుపయోగించుటకు వీలులేదు. 'ఐన' అన్నమాట ఉపయోగించుటచేత ఆయర్థమంతయు వచ్చుచున్నది. ఎట్లు వచ్చుచున్న దనఁగా తెలుఁగువాండ్రు ఏదో రహస్యము తమస్నేహితులతోనో, ఇతరులతోనో చెప్పునప్పుడు, మరియు నా చెప్పుటలో కొంత స్వార్థ మున్నప్పుడు, గొంతుసవ్వడి తగ్గించి, మొగము తీసుకొనివెళ్ళి వినెడివాని చెవిలో పెట్టి "మీ కొక రహస్యమైన మాట చెప్పెదను. మీ కొక రహస్యమైన విషయము చెప్పెద" అనియందురు. ఆరహస్యముయొక్క గాఢత్వమంతయు 'ఐన' ప్రయోగించుటలో నున్నది. ఇది తెలుఁగుజాతిలక్షణము. తెలుఁగుభాషయొక్క యొకానొక

ప్రయోగరహస్యము. ఆరహస్య మిమిడియున్న 'అగు' ధాతువుయొక్క భూతార్థక క్రియాజన్యవిశేషణమును చొప్పించి పెద్దన్న ఈపద్యము వ్రాయవలసి వచ్చినది. ఆ యొక్కమాటతో ఇంత యర్థము పుట్టుచున్నది.

కాని యిక్కడ ఇంతఆప్యాయత తనమీద సిద్ధున కేల రావలయునన్న సందేహము ప్రవరునకుఁ గలుగకుండ "భూమి నిర్జరవంశోత్తమ!" యని పిలిచినాఁడు. 'ఓ చతురాస్యవంశ కలశోదధిపూర్ణశశాంక" అని పిలిచినప్పుడు సిద్ధునిలక్షణ మెట్లుండెనో, ఇప్పుడు నట్లే యుండెను. ప్రవరుఁ డిందులో మోస మున్నదని తెలిసికొనలేకపోయెను.

'అద్దిరయ్య!' అన్నప్పుడు ప్రవరుని ముఖములో వెక్కిరింత స్ఫురించెను. ఆసిద్ధునిగుండెలోనున్న మోసము వాని మొగములో కనిపించదు, వాని మాటలో విని పించదు.

మఱియు ప్రవరునకు వాఁ డెదో మందు చెప్పెను. దానితో తనతీర్థయాత్రాకౌతుకము తీఱునని యొక యాశ కలదుగదా! ఆయాశ ప్రవరునికి తెలివి కలిగించలేదు.

ఈ సందర్భమంతయు సరిగా గుండెకు పట్టించుకొనుటకు ఇప్పుడు మాసిపోయినది, కొన్నియేండ్లక్రిందటివరకు సమృద్ధిగా నున్నది, ఇప్పటికైన ముదురని పల్లెటూళ్ళలో కలది - యొక సందర్భము తెలిసినచో చాలును. కోయ వాండ్రు, పాములవాండ్రు, మందులవాండ్రు, మందు లమ్మెడు నాడవాండ్రు-బిచ్చమునకు వత్తురు. వాండ్రవద్ద చటకాలు సంపాదించుటకు యువకులు ప్రవర్తించెడు ప్రవర్తన, వారు

మం దిచ్చిచేసెడు మోసము పర్యాలోచించినచో ఈఘట్టము నందలి చమత్కారమంతయు సువిదిత మగును.

బాగుగా చదువుకొన్నవారుగూడ వాం గ్రేదో మం దిత్తురని, తమకోరిక దానితో సిద్ధించునని మోసపోదురు. ఒకనాటువైద్యుఁడు, ఒకజ్యోతిష్కుఁడు, ఒకనాటుపండితుఁడు -గృహస్థుల యిండ్లకు వచ్చి తాము నయముచేసిన రోగముల చిత్రాలు, చెప్పిన ఫలముల యాథార్థ్యము, జరిగిన చిత్రాలు, పాండిత్యము మెచ్చుకొని తమ కితరులు చేసిన గౌరవముల చిత్రాలు – చెప్పుకొనుట లోకవృత్తము. ఈలక్షణమే ఆ సిద్ధునిలో నున్నది. ఆలక్షణమును దీపింపఁజేయుటకే పెద్దన్న గారు ఆరెండుపద్యములు, ఆపెద్దవచనము వ్రాసిరి.

ఎప్పుడు సిద్ధుఁడు తనదివ్యౌషధము పేర్కొనెనో, ప్రవరుఁడు మెత్తపడిపోయెను. "నేను నీశిష్యుఁడను మహాను భావా! నన్ను రక్షింపు" మన్నాఁడు. సిద్ధునకు కావలసిన దిదియే. వెంటనే సజ్జదంతపుబరణి తీసినాఁడు. అది యిది యని చెప్పలేదు. ప్రవరుని రెండుకాళ్ళకు పూసినాఁడు. వాని దారిని వాఁడు పోయినాఁడు. ఇది ఇంతసే పుండుననిగాని, దానిలక్షణ మిది యనిగాని వాఁ డేమియుఁ జెప్పలేదు. ఈ ప్రవరుఁడు —

"ఇంక నే మున్నది ? మనము సర్వదేశములకుఁ బోవచ్చు" ననియే తప్ప, "ఈపస రెంతసే పుండును ? కాళ్ళు కడిగికొనినచో పోదా?" అన్న యూహయే లేకుండెను. ప్రవరుఁడంత పండితుఁడై, అగ్నిహోత్రియై, సంపన్నగృహస్థై

ఎంతో భోగియై, తీర్థసందర్శనాభిలాషయందలి పిచ్చిచేత, తత్కాలమున నవివేకిగా భాసించినాఁడు. ఇందులో నాశ్చర్యము లేదు. పెద్దయుద్యోగస్థులు, ఆవులించినచో ప్రేవులు లెక్కపెట్టెడివారు, ఒకానొక మోహభావముచేత సర్వవివేకమును తత్కాలమున కోలుపోవుట లోకమునందు సమృద్ధిగా నున్నది.

ఇది పదునేడుపద్యములలోని కథ. ఇంత విచిత్రముగా లోకమును ప్రతిబింబింపజేసిన కథ. 'అద్దిరయ్యా', 'ఐన' - ఈరెండుమాటలతో ఒకనిచమత్కారవాక్కు, తెలుఁగు భాషాప్రయోగములో నున్న యొకనిగూఢమైన విషయము నిరూపించి, పరమవ్యంజకమైన రచన పెద్దన్నగారు చేసినాడు.

౪

ప్రౌఢులైన కవులు పలురహస్యములను కథ చెప్పుచు నిముడింతురు - అట్టి రహస్యములను కథ చదువుచు పాఠకుఁడనుసరించినచో విస్పష్టత ఎక్కువ కలుగును. ఆరీతిగా సిద్ధుఁడు పసరు ప్రవరునికాళ్ళకు రాచెను. ఆసమయ మెట్టిది? అన్నవిషయము క్రమముగా తెలియవలయును.

ఆమం దిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాద్యదరీఝరీనిరీక్షాపేక్షన్

ఈపద్యమువలన ప్రవరుఁడు వెళ్ళినాడనిమాత్రమే తెలియుచున్నది. సిద్ధుఁడు పసరును పూసినపుడు, ఇది ఏమి పసరు ? ఎన్నాళ్ళుండును ! మొదలైనవేవియు ప్రవరుఁ

డడుగలేదు. ఇట్లడుగకుండురా ? యని ప్రశ్న. 'అడుగ' రనునది సమాధానము. తీర్థయాత్రాకౌతుకవ్యగ్రతయొక్క లక్షణ మిది. ఎక్కడికి పోవలయును ! మొదలైన ప్రశ్న ఎవనికుండునో, పలుచోట్ల తిరుగవలయునన్న యూహ ఎవనికుండునో, వానికాప్రశ్న యుదయించును. ప్రవరుని తీర్థయాత్రాకౌతుకత ఒక్కండే ఒక్కడు ప్రదేశమునుగుఱించి కలదు అక్కడికి పోవలయుననియే యుద్దేశ్యము వెళ్ళి ఆప్రదేశమును చూచివచ్చినచో తనసర్వమైన కోర్కెయు తీరినది. మఱియొకచోటికి పోవలయుననియే లేదు. ఆయొక్క ప్రదేశమునకే పోవలయును ఆప్రదేశమునకు వెళ్ళివచ్చుటకు ఈపూత చాలునని ప్రవరుని యభిప్రాయము ఆప్రదేశ మేది ? బదరీవనము.

కాలికి పసరు పూసినంతనే ప్రవరుని యూహ బదరీవనము పోవుదమనియే. ఇతం డెప్పుడు బయలుదేఱినా డనునది తరువాత ప్రశ్న. తొలుత బదరీవనము హిమవత్పర్వతములో నున్నది. అచ్చటికి పోవలయుననియే ప్రవరుఁడు సంకల్పించినాడు. ఆసంకల్పముప్రకారము బదరీవనమునకే వెళ్ళినాడు. ఇది యంతయు కథనుబట్టి తెలిసికొనవలసిన విషయమే.

వెళ్ళినాడు. ఈపద్యము - ప్రథమాశ్వాసముచివరి పద్యము వెళ్ళినాడన్న విషయముమాత్రమే చెప్పను. కాని ఈపద్యరచనలో నొకచమత్కార మున్నది. సరిగా హిమవత్పర్వతముమీఁదికి వెళ్ళినస్థితి ఈపద్యములో నున్నది. రెండవచరణముచివర 'శృంగ' అన్నశబ్దము కలదు. చివరి

హ్రస్వాక్షరము ఆకాశములో ఎంతఎత్తు వెళ్ళవలయునో అంతయెత్తు వెళ్ళెను. అక్కడ నాగిపోవలయును. అచ్చటి నుండి క్రిందికి దిగవలయును - అన్నయర్థ మీహ్రస్వాక్షర ములోఁ గలదు. అచ్చటినుండి క్రిందికి చూచినాడు. ఏమి కనిపించినది ? శ్యామలకోమలకాననములు కన్పించినవి. ఈ మూఁడును భగణములు. ప్రథమాక్షరములు దీర్ఘములు. తక్కినరెండక్షరములు హ్రస్వములు. 'శృంగ'లో నున్న చివరియక్షరము తరువాతసంయుక్తాక్షరముచేత గురు వైనది. ఈమూఁడుభగణములలోని ప్రథమాక్షరములు మూఁడును సహజముగానే గురువులు. ఎందు కిట్లు వ్రాసెను? ఆపై నుండి ప్రవరుఁడు హిమవత్పర్వతమును జూచెను. ఆ పర్వతము శృంగములు, నడుమ సానువులు - వీనిచేత ఎగుడు దిగుడులుగానుండెను. ఆఎగుడుదిగుళ్ళలో ఒకవిలక్షణత కలదు. దీర్ఘాక్షరములవలె కొమ్ములు పొడుచుకొనివచ్చినవి. హ్రస్వా క్షరములమేర బల్లపఱుపుగా నున్నది. ఆప్రదేశముయొక్క స్వరూపము ఈకూర్పుచేత వ్యజ్యమాన మగుచున్నది.

అక్కడనుండి దిగవలయును. 'హేమాద్ర్యదరీఝరీ సరీతొపేక్షణ' ఈమూఁడు 'రీ' కారములు ప్రవరుఁడు క్రిందికి దిగెడి లక్షణమును చెప్పుచున్నవి. అతఁడు మూఁడంచెలుగా దిగిన ట్లున్నది.

ఇచ్చట కొందరు ఈ'రీ'లు క్రిందికి దిగుట నేల చెప్పును ? పై కెక్కుట నేల చెప్పకూడదని యందురు. ద్వితీయాశ్వాసము మొదటిపద్యము—

'ఆటఁ జని కాంచె. . .'

నని యున్నది. దిగకపోయినచో చూచుట లేదు. కనుక ఈ'రి'లు దిగుటకే వ్యంజకములు. వ్యంగ్యముదాక నెందులకు? అర్థముకూడ సందర్భమునుబట్టియే. వ్యంగ్యము సందర్భమునుబట్టియే కల్గును. ఏది ప్రస్తుతమో అదే వ్యంగ్యము కాగలదు.

ఆటఁ జని కాంచె భూమిసురుఁ
డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
వటలముహుర్ముహుర్లుఠద
భంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరి
పుల్లకలాపకలాపిజాలముఁ,
గటకచరత్కరేణుకర
కంపితసాలము శీతశైలముఁ.

అతఁడు హిమవత్పర్వతమును జూచెను. ఆహిమవత్పర్వతమును కవి రెండుసమాసములతో చెప్పెను. ఆకాశము నంటుచున్న పైభాగమునందు ప్రవహించుచున్న సెలయేళ్ళ యొక్క ఎగురుచున్న తరంగముల మద్దెళ్ళ మ్రోతలకు తగినట్లు పింఛములు విప్పిన నెమళ్ళు కలది, కటకములయందు తిరుగుచున్న ఆడుఏనుగులచేత కదల్పఁబడిన వృక్షములు కలది. ఇవి రెండే సమాసములు. ప్రవరుఁడు పర్వతముమీఁద నొకచోట దిగినాఁ డనుకొందము. దిగినచో, దిగినవాని కెంత దూరము కన్పించును? ఆ దూరములో సెలయేళ్ళు ప్రవహించుట, వానికి నెమళ్ళు నృత్యము చేయుట కనుపించునా? చెట్లను కదల్చుచున్న ఆడుఏన్గులు కనిపించునా? కనిపించి

సచో నతనికి భయము వేయదా ? అందుచేత ఈచూచిన చూపు పర్వతముమీద దిగకుండ చూచిన చూపు కొంత ఎత్తునుంచి చూచిన చూపు. ఆచూపునకే ఒకచదరపుమైలు ప్రదేశములో జరుగుచున్న విషయము కనుపించును. అది యంతయు నొకసారి కనుపించును. అతఁడటునిటు చూచెను. ఒకవైపున నది కన్పించినది. రెండవవైపున నిది కన్పించినది ఒకదృష్టిప్రసారమునకు కనపించినది. సమాసములో పెట్టి చెప్పినాడు. ఈసమాసములు వ్యర్థమైనవి కావు ఇంత అర్థవంతములైనవి.

అటునిటు – అనుట యెందుకు ? సెలయేళ్ళు మద్దెళ్లు మ్రోసినట్లు ప్రవహించుస్థలములు వేరు. కొండలపై ఎత్తిపోతలుగా పడుచున్నప్పుడుగాని అంత సవ్వడి కలుగదు. అందుచేత ఒకవైపున కనిపించిన ప్రదేశము కొండలు, రాళ్లు గుట్టలు – సెలయేళ్ళమ్రోత. రెండవవైపున కనిపించిన ప్రదేశము కొండసానువులు. అడవిజంతువులు ఆకలములు మేయుచు తిరిగెడి ప్రదేశము ఆవైపు వేరు. ఈవైపు వేరు.

"కాంచి యుంతరంగంబునఁ దరంగితంబగు హర్షోత్కర్షంబున" – చూచినంతనే అతనిహృదయమున మహానందము కలిగినది. ఎందునకు కలిగినది ? అట్టిదృశ్యములు చూచినందు వలన కలిగినదా ? దిగినాడు. ఎచ్చట దిగెనో, అచ్చటనే దిగినందుకు కలిగినదా ? ఎచ్చట దిగినాడు ? బదరీవనము నందు దిగినాడు. అది బదరీవనమని తనకు దెలియునా ?

నరనారాయణచరణాం

బురుహద్వయభద్రచిహ్నాముద్రితబదరీ

తరుషండమండలాంతర
సరణిఁ ధరణీసురుండు సనఁ జన నెదుటన్.

అతఁ డిదివఱ కీబదరీవనమును జూడలేదు చూడక పోయినను రేగుచెట్లెక్కువగా నున్నవిగనుక బదరీవన మను కొన్నా డనుకొందము. నరనారాయణుల కాలిగుర్తు లక్కడ నున్నవి ఉన్నవా? ఇతఁడు మనస్సులో ననుకొను చున్నాడా?

అంత నతనిమీఁద చల్లనిగాలులు వీచినవి. అడవిలో ఏనుగులు చెట్లచివుళ్ళు లాగుచున్నవి. పెద్దపులులగుఱ్ఱులు వినిపించుచున్నవి అడవిపందులు ముస్తె లెత్తుచున్నవి. మను బిళ్లు దూకుచున్నవి- మొదలైనవి చూచినాడు. ఆప్రదేశము లకు తాను పోలేదు. దూరము నుండి చూచిన విషయము లివి. పర్వతమునకు వచ్చుట జరిగినది. బదరీవనమును జూచినాడు. అక్కడ నేమి చూడవలయును? 'తరుగహనగుహావిహార తత్పరమతియై' ఏమేమి చూచినాడు? భగీరథుఁడు తపము చేసిన చోటు, గంగ నేలకు దిగిన చోటు, పార్వతి శివునకై తపము చేసిన చోటు, మన్మథుని శివుఁడు కంటిమంట నార్చిన చోటు, కుమారస్వామి రెల్లులో పుట్టిన చోటు - వీనినన్నింటిని సంతోషముతోఁ జూచినాడు. ఈపద్యముతో పది ప్రశ్నలకు సమాధానము వచ్చినది. అతఁడు బదరీవనమున కేటికి వచ్చెను? ఇవియన్నియుఁ జూచుటకు వచ్చెను ఇవి ఇవియని యతని కెట్లు తెలియును? ఇది గడ్డుప్రశ్న. కవి పిచ్చిగా వ్రాసినాడా? మహాశిల్పియైన కవిభావములు తెలిసి కొనుట కిట్టిదియే నికషోపలము.

ప్రవరుఁడు తీర్థయాత్రకు పోవలయునని ఎన్నియేండ్ల నుండి యూహించుచుండెనో? ఎంతమందియాత్రికుల నడిగెనో? మన మూహించుకొనవలసినదేకదా? అతని ప్రధానమైన కౌతుకము బదరీవనదర్శనము. ఇక్కడికే వచ్చినాడు. ఇంకొకప్రదేశ మతనియూహాలో లేనేలేదు. ఈప్రదేశమును గుఱించి ఎంతమందివలన వినెనో వారి నడిగి ఏప్రదేశ మెక్కడున్నది? దేని కేది ఎంతదూరముననున్నది? ఆప్రదేశమును గుర్తుపెట్టుట యెట్లు? – ఇట్లు వందప్రశ్నలు అతఁడు యాత్రికులకు వేసి, సమాధానములు పడసియుండియుండును. హిమవత్పర్వతముమీఁది ఈసర్వప్రదేశములు ప్రవరుఁడు పూర్వము చూడకపోయినను, అతనికంటికి పటముకట్టినట్లున్నవి. ఈపద్యములోని యర్థ మిది

ఈకథాభాగమంతయు ప్రవరుని యాలక్షణమంతయు వెనుక దాచి పెద్దన్నగా రీపద్యమును వ్రాసినారు. అతని నిక్కడ దింపినారు. ఇవియన్నియుఁ జూచినతర్వాతగాని యతనిమనస్సునకు శాంతి కలుగలేదు. అన్నిటిని జూచిన తరువాత అప్పుడు హిమవత్పర్వతమునుగుఱించి యూహింపనారంభించినాడు. రెండుపద్యములు ఆవర్ణన సాగినవి. పురాణకథలు స్మృతికిఁ దెచ్చికొన్నాడు. ప్రధానమైన యుత్కంఠ తీఱినది. మానవసామాన్యమైన యుత్కంఠ నదులు, వనములు, పర్వతములు చూడవలయు నన్నది. దానికి తొందర లేదు. రేపు వచ్చి చూత మనుకొన్నాడు. ఇంతలో నతని పాదములయందు రాచిన పసరు కరగిపోయినది.

ఇప్పు డొక ప్రశ్న పుట్టుచున్నది. అప్పుడు మధ్యాహ్న మైనది. సిద్ధుఁ డతని కాళ్ళకు పాదలేపము రాచిన దెప్పుడు? ఇతఁడు బయలుదేఱిన దెప్పుడు? ఇతఁడు పర్వతముమీఁది బహుప్రదేశములఁ జూచెను. చూచుటకు చాలసేపు పట్టును. అతఁడు నిన్నటిరాత్రియే ఇచ్చటికి వచ్చె ననుటకు వీలు లేదుగదా? కనుక మరునాటిప్రొద్దుననే వచ్చెను. ఇతఁడు ప్రొద్దుట బయలుదేరినపుడు సిద్ధుడు పాదలేపమును పూయుట సంభవించదు నిన్నజరిగిన ప్రసంగముబట్టి సిద్ధుఁడు వెంటనే పాదలేపమును రాచి తనదారిని తాను పోయెను. నాదగ్గర నొకపాదలేప మున్నది. నీకాళ్ళ కిది రేపుప్రొద్దున రాచెదను. నీయిష్టము వచ్చినచోటికి నీవు పోవచ్చును. మొదలైన ప్రసంగము సిద్ధుఁడు చేసినచో, ఆరాత్రి అతఁ డక్కడే యున్నచో, పాదలేపమునుగూర్చిన సర్వప్రస్తావనయు జరిగియేయుండును. ప్రవరుఁడు కొండమీఁద పడిన యీఇబ్బంది జరుగనేజరుగదు. ఆసిద్ధుడు ఈపని కోపముతో చేసినాడు. ఇతని కిట్టిపరాభవము చేయవలయుననియే చేసినాడు. అనగా సిద్ధుడు వచ్చినరోజుననే, ప్రసంగము జరిగినప్పుడే, అది యే ప్రొద్దుకుంకెడు వేళకో, ఇతనిపాదములకు ఆపసరురాచి, వాని దారిని వాఁడు వెళ్ళినాడు.

ఈప్రవరుఁ డగ్నిహోత్రి. ఇతఁ డారాత్రి అగ్నిహోత్రకార్యములు చేసినాడా? ప్రొద్దున హిమవత్పర్వతమునకు బయలుదేఱకముందు స్నానాదికములు చేసినాడా? ఈ రెండుస్నానప్రక్రియలతో నతనిపాదలేపము పూర్వమే కరగి

పోయియుండవలయును. 'నీహారవారిఁ బెరసి' కరగిపోవు పాద లేప మది.

అతఁడు జాగ్రత్తగా స్నానము చేసెను. వ్యాధిగ్రస్తులైనవాండ్రు, లేదా కాలిమీఁద నొకకురుపు లేచినవాండ్రు పట్టీ వేసికొని, ఆపట్టీ తడియకుండ స్నానము చేసినట్లు. కాళ్ళు కడిగికొన్నట్లు, చేసియుండును – అనుకొనవలయును. కాని ఇక్కడ పర్వతమంతయుఁ దిరిగినాడు. చిక్కనిగడ్డి మొలచిన చోటులు. ఆమంచునకు తెల్లవారులు చెడిపోకుండ నున్న పాదలేపము నిస్సందేహముగ చెడిపోవును కరగిపోవును. మంచుకాలముల గడ్డిపొలములలో తిరిగెడివారికి గాక దీనిమర్మము తెలియదు. ప్రవరునకు సిద్ధుఁడు నిన్నటి సాయంకాలమే పాదలేపమును పూసెను. దాని నితఁడు మరునాటి ప్రొద్దుటివరకు రక్షించుకొనెను. అనియే చెప్పవలయును.

ఈ కథలో ఇన్ని మెలికలు పెట్టి, చేయుటయే పెద్దన్నగారి శిల్పములోని రహస్యము. ఇవియన్నియు కలిపి పదునాల్గు పద్యములు. పాదలేపము కరగిపోయినంతనే అతఁడు దుఃఖపడినాడు. ఈదుఃఖములో చివరకు "నేను వట్టి తెలివితక్కువవాఁడను. ఏనుగులు, పెద్దపులులు మొదలైన క్రూరజంతువులు కల ఈకొండకు వచ్చుటయేమిటి? శ్రోత్రియులు బుద్ధిజాడ్యజనితోన్మాదులుకదా!" అనుకొనినాడు. ఈమాటనుబట్టి కొందరు విమర్శకులు ప్రవరుఁడు శ్రోత్రియుఁడుగనుక అతనికి బుద్ధిజాడ్య మున్న దనిరి, ఛాందసుఁ డనిరి. అనుకొనుట కలదు. అట్లు వ్రాసినవారు కలరు. తాను చేసిన పని దుష్ఫలితము నిచ్చినప్పుడు లోకము

నందు మానవులు తమ్ము తాము నిందించుకొనుట కలదు. పరమవివేకులుకూడ తమ్ముట్లు నిందించుకొనుట యుండును. దానినిబట్టి వాఁడవివేకి యనుట అవివేకము ప్రవరుఁడు అవివేకి కాఁడు గొప్ప లౌకికుఁడు చాల గడుసువాఁడు. లోకజ్ఞుఁడు. భోగి అతఁ డెంత భోగి యనఁగా

పూర్వ: దివలలో నొకభవనమును జూచి దానివద్దకు వెడలినప్పుడు

మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపు నొక్కమారుత మొలసెన్.

కస్తూరివాసనచేత రెట్టింపైన పచ్చకర్పూరము కలిపిన తాంబూలపు వాసనతో కూడిన గాలి రాగా, అచ్చట స్త్రీలున్నారని యతఁడు తెలిసికొనెను. అతని భోగలక్షణ మిది. ఆతాంబూల మెట్టిదియో, అందులో యౌవనవతులైన స్త్రీ లెట్టి పాళములో కస్తూరీఘనసారములను కలిపి తాంబూలము సేవింతురో, ఆగాలిపరిమళ మెట్టిదో — ఇంత తెలిసినవాఁడు ప్రవరుఁడు. వాని యనుభవవిశేష మిట్టిది.

కస్తూరివాసనకంటె, పచ్చకప్పురపు వాసన రెండింతలుగా నున్నదఁట! ఈరసహ్య మనుభవైకవేద్యము. ఈపద్యములనుబట్టి ప్రవరుని యనుభవవిశేషము, అతనియూహాలు, అతనికి తెలిసిన విషయములు, అతని కోరికలు - అన్నియు వ్యంగ్యభూతములై యున్నవి. ఇన్ని విషయములు వెనుక దాచి, యూరకే కథ చెప్పుకొనిపోవుచున్నట్లు కనిపించుట ఎంతటి గడుసుదనముగల కథాకథనశిల్పమో భావుకులకే

తెలియఁవలయును. ఇట్టిరచన నన్నయగారే చేయుదురు. పెద్దన్నయే చేయును.

ప్రవరునిగుఱించి, వరూధినినిగురించి రెండు విడివ్యాసములు వ్రాసినఁగాని పెద్దన్నగారిశిల్పపారమ్యములోని తుదిసోపానముకంటె క్రింది యున్నతసోపానముయొక్క స్వరూపము తెలియదు. తుదిసోపాన మతనికథాకథనశిల్పము.

౫

మనుచరిత్రలోని ద్వితీయాశ్వాసములో నున్నవి కథాసందర్భమైనవి డెబ్బదియారుపద్యములు. వరూధిని ప్రవరుని చూచినది ఇరువదియెనిమిదవపద్యములో. అనఁగా నిది యేబదిపద్యముల కథ. ముప్పదియెనిమిదిపద్యములవరకు వరూధిని ప్రవరుని చూచి పడిన యవస్థావర్ణనము. వీరియిరువురి సంభాషణ ముప్పదియారుపద్యములు. అందులో ప్రవరుని నోట వచ్చిన మాటలు తొమ్మిదిపద్యములలో నున్నవి. ఈతొమ్మిదిపద్యములనుండి ప్రవరునిశీలము నిర్ణయించవలయును. ఇరువురి సంభాషణయు ముప్పదియారు పద్యములు మాత్రమే చెప్పిన ప్రవరుఁడు ఎంత బిగువు కలవాడు, ఎంత తక్కువమాటలు కలవాఁడు, ఆ సన్నివేశమునం దెంత అనభిముఖుఁడు – విచారించవలయును.

ప్రవరునిగూర్చి పదివిధములుగా చెప్పఁకోబడుచున్నది. అతఁడు అలౌకికుఁ డని, ఎట్లు మాటాడవలయునో తెలియదని యనెడువా రున్నారు. ప్రవరుఁడు హిమాలయమునకు బోవునప్పు డెట్టివేషముతో నుండెను? అతఁ డెట్లుండెను?

ఈసంగతి మనకు తృతీయాశ్వాసములోగాని తెలియదు. మాయాప్రవరుని వేషమును కట్టినాడు. ఆకట్టిన వేషమును పెద్దన్నగారు వర్ణించిరి.

అర్ధచంద్రునితేట నవఘళించు లలాట
పట్టిఁ దీర్చిన గంగమట్టితోడఁ
జెక్కుటద్దములందు జిగివెల్లివలు చిందు
రమణీయమణికుండలములతోడఁ
బసిఁడిద్రాఁతచెఱంగుమిసిమి దోఁపఁ జెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాకట్టుజాళువామొలకట్టు
బెడఁగారు పీఁకాపిపింజెతోడ
ధవళధవళములగు జన్నిదములతోడఁ
గాశికాముద్ర యిడిన యుంగరముతోడ
శాంతరస మొల్కు బ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁ డయ్యె వియచ్చరప్రవరుఁ డపుడు.

ఈవేసముతో ప్రవరుఁడు హిమాలయమునకు వచ్చెను. వరూధిని చూచిన ప్రవరుఁ డీవేషముతో నుండెను. అందుచేత ఆవేసమునే గంధర్వుఁడు కట్టెను.

ఇట్టివేసముతో ప్రవరుఁడు హిమాలయమునకు బయలు దేఱెనని పెద్దన్న మొదటనే వ్రాయవచ్చునుగదా! సామాన్యుఁడైన కవి యట్లు చేయును. శిల్పియైన కవి యిట్లు చేయును. అతని యీరూపవర్ణనము చేయఁదగిన స్థల మిది. ఇచ్చట వర్ణించుటలో నొకప్రయోజన మున్నది. మొదట వ్రాసినచో నది నిష్ప్రయోజనము. కథలో ప్రధానమైన పాత్ర కంటికి కట్టినట్లుండునుకదా - అన్న యొకవిషయమును చెప్పినచో ఆ కంటికి కట్టినట్లు వ్రాయుట ఒక తక్కువవిషయము. మనస్సునకు దీపించునట్లు వ్రాయుటఎక్కువవిషయము.

ఈపద్యములో రెండు సంగతులు జ్ఞాపక ముంచుకొన వలయును. లలాటపట్టి దీర్చిన గంగమట్టితో ప్రవరుఁ డుండెను. అతఁ డానాడు గంగాస్నానము చేసి బయలుదేఱ ననుకొనవలయునా? గంగాస్నానము చేసినను సిద్ధుఁడు రాచిన పాదలేపము చెడిపోలే దన్నమాట కరగిపోలే దన్న మాట. అట్లు గంగా స్నానము చేసినను కరగిపోని పాద లేపము 'నీహారవారి బెరసి కరగి'పోయెను. కరగిపోవుట యెఱుంగ డద్ధరణీసురుఁడు. దైవకృతమున కిల నసాధ్య బు కలదె? అది కరగిపోయినమాట యతనికి దెలియదు. అనఁగా కడచినరాత్రి స్నానము చేసినాఁడు, ఆపాదలేపము కరగి పోలేదు ఇప్పుడు కరగిపోయినది అది కరగిపోవునని యతఁ డనుకొనలేదు. ఇప్పు డెందుకు కరగిపోయినది? ఇది దైవకృత మని కవి చెప్పుచున్నాడు. అసలాపాదలేపము కరగియేపోదా? లేదా, కొన్నిగంటలుమాత్ర ముండునా? ఇదియంతయు నొకవిచిత్రమైన సమస్య. ఇది దైవకృతముగా కవికల్పన. ఇచటి దైవకృత మెట్టిది? భవిష్యత్తులో స్వారోచిషమనువు జన్మించుటకు ఈసన్నివేవము జరిగెను ఇది దైవకృతము ఆయాపథమునుగూర్చిన తక్కనవిచారణయంతయు చాల స్వల్పమైనది. వందయూహలలో నేదైనను కావచ్చును ప్రధానమైనది. అట్లు జరుగుట. ఈజరుగుటను గుర్తించిన వాఁడు పెద్దన్న. ఒకఁడు పరమమహాకవి యగుట యిటువంటి చోటులందు.

ఈ కథలోనున్న అన్నిచిక్కులు ఒకయెత్తు. ఈ 'దైవకృత' మన్నమాట వ్రాయుట యొకయెత్తు.

దైవకృతమున కిల నసాధ్యంబు కలదె? అన్నమాట ఏదో కథాధోరణిలో చెప్పినమాట కాదు. విశిష్టమైన యర్థముతో చెప్పినమాట. అందుచేత పెద్దన్న వ్రాసిన మాటలలోని గాంభీర్యము విచారణచేసి తెలిసికొనవలయును.

ఈపద్యములోని రెండవవిషయము అరుణాంశుకోత్తరీయము, ఎఱ్ఱని రంగువేసిన ఉత్తరీయము. దీనికి బంగారపు తీగతో అక్షరపంక్తివలె వ్రాసిన అంచు కలదు. జరీఉత్తరీయము. ఎఱ్ఱనిరంగు ఉత్తరీయము ఒకటి యతఁడు ధనవంతుఁడు, భోగి అని చెప్పుచున్నది. రెండవది ఆయుత్తరీయమెఱ్ఱరంగు కలదనుటచేత అది అద్దిన రంగా, సిర్కావి రంగా? సిర్కావిరంగైనచో సిర్కావిరంగనిచెప్పవచ్చును. అట్లని చెప్పక అరుణాంశుక మనుటచేత అద్దినరంగనియే దృఢమగుచున్నది. అద్దినరంగనినచో తప్పేమి? అతఁడగ్నిహోత్రి. బ్రాహ్మణుఁడు. సోమయాజి. అట్టివా రెఱ్ఱని గుడ్డలు కట్టుకొనఁగూడదు. తెల్లనియుడుపులే ధరించవలయును. దీనిచేత ప్రవరునిమనస్సులో ఎచ్చటనో లీలగా భోగలక్షణ మున్నదని తెలియుచున్నది. ఈభోగలక్షణమును — ఇది భోగలక్షణము కాదు, కాకపోయినను జీవలక్షణము — దీనిని పెద్దన్నగా రొకటిరెండు స్థలములయందు చమత్కారముగా సూచించినారు.

"ఆనందో బ్రహ్మ" అని వరూథిని యుపనిషద్వాక్యము చెప్పినతర్వాతి పద్య మిది.

> అనుచుఁ దన్నొదఁబఱచు నయ్యమరకాంత
> తత్తరము చూచి...

త నొ్నడఁబఱచుచున్నదట! అనఁగా ఆమె చెప్పిన మాటలలో ఏదో దూరముగా తనయంతరాత్మలో నొకానొకయాభిముఖ్యముకలిగిన దన్నమాట యేనా?ఆయాభిముఖ్య మెందుకు చెడిపోయినది? ఆమె త త్తరముపడినది. ఆత త్తరము అతనికి సిగ్గును, వెగటును పొడమించినవి. అప్పు డామె మాటలకు ప్రత్యాఖ్యానము చేసినాడు.

ఇది ప్రవరునిశీలమునకు భంజకమా? ఒకవ్యక్తిశీలము ను నిర్ణయించుట యెట్లు? జీవునియందలి సంస్కార మొకటి, అది మనస్సునకు స్ఫురించుట యొకటి. ఈస్ఫురించినదానిని తనంతట తాను విచారణచేత తొలఁగఁద్రోసికొనుటయో, బహిఃపరిస్థితులనుబట్టి దానియందు వైముఖ్యము కాంచుటయో – ఈ రెండువిధములుగా శీలరక్షణ కలదు. రెండవదానికంటె మొదటిది యుత్తమము, రెండవది క్రియాజగత్తుయొక్క దృష్టితో ప్రశంసనీయము. భావమును భావముగానే త్రుంచవచ్చును. ఇది యట్టిది. క్రియాభిముఖమైనపుడుకూడ దాని నదుపులో పెట్టవచ్చును. అది మనుష్య ప్రయత్నాధిక్యమువలన లోకమున కెక్కువ యాదరణీయమగును. ఈ యన్నిదశలయందును శీలరక్షణ జరగినదనియే అర్థము.

మాయాగంధర్వుఁడు తత్ప్రవరదేహసమిద్ధశిఖదీప్తిని శాంబరీమహిమచేత సంగ్రహించుకొన్నాడు. ఆ శాంబరీ మహిమచేత సంగ్రహించుకొనుట యీ జీవసంస్కారగతాభిముఖ్యముచేతనేమో? ప్రవరునియొక్క ఆత్మ, జీవసంస్కారము పరమానభిముఖములైనచో అతనిశాంబరీమహిమకు

ఇచ్చట నాకర్షణ కలుగదు. లోకమునందుకూడ అవతలి వానిని ఇంద్రజాలికుఁడు వశపఱచుకొనును. అది అందఱను చేయలేఁడు. ఒక మంత్రగాఁడు తనమంత్రమును మఱియొక మంత్రగానిమీఁద ప్రయోగించలేఁడు. ఇది యంతయు వేఱే విషయము. శాంబరీమహిమకుమాత్రము ఇట్టి యొకానొక యాభిముఖ్యము కావలయునేమో! ఈసంగతిని ప్రపంచించి వ్రాసినచో సాహిత్యవిమర్శ వెనుకపట్టునని వదలుచున్నాను.

ప్రవరుఁడు హిమవత్పర్వతమును చూచెను. పోద మను కొనెను. పాదలేపము కరగిపోయెను. కాలెత్తఁబోయెను. కాలు రాలేదు. వెంటనే సిద్ధాపదేశమువలన తన కీయాపద వచ్చె ననుకొనెను. దుఃఖపడుచు పోవుచుండెను. ఆ పోవు చున్నవానికికూడ అచ్చటి పార్వతికసౌందర్యము పొడకట్టక పోలేదు. వజ్రాయుధముతో నఱికినట్లున్న కొండయిడుపు జేవురుపట్టులు, గంగప్రవహించుట, కరిముకాదివృక్షములు, ప్రతిధ్వనులు – వీనిని చూచెను. చూచెననఁగా ఆ సౌందర్య మును గ్రహించెనని కావ్యమునం దర్థము.

అది ముని యాశ్రమ మనుకొనెను. గంగ కాలువ లోయకు తలక్రిందుగామలకలై దిగుచున్నది. ఆలోనికి మెట్ల వలె త్రోవ యున్నది. ప్రక్కనున్న మల్లెతీగలను పట్టుకొని లోనికి దిగవలయును. అట్టిచోట ఋషివాటిక యుండు నను కొనెనా? అది నిస్సందేహముగా నొక కేళికాప్రదేశమై యుండవలయును. మఱి యెందుకు పోయెను? ప్రవరుఁడు కాక మఱియొక్కఁడైనచో వెనుదిరిగి పోయెడువాఁడు. అతనిలో

నున్న తీర్థసందర్శనాభిలాష చెప్పరానంతది. అది వట్టితీర్థ సందర్శనాభిలాషయుఁ గాదు. అడవులు, కొండలు, నదులు, గుహాలు – వీని నన్నిటిని జూడవలయునన్న యభిలాషకూడఁ గలదు. లేనిచో—

'తొండముల్ సాచి'... మొదలైన పద్యముల ప్రసక్తి యుండదు.

మఱియు నతఁడు "అగ్గిరికటకతటనిరంతరతరుగహన గుహావిహారతత్పరమతి" యు నై యుండెను.

ఇంటికి పోవుటకు వీలులేదని తెలిసెను. కాని ఈ తరుగహనాదిదర్శనతత్పరత్వ మతనిజీవములోనుండి పోవునది కాదు. అందుచేత వట్టిప్రదేశమునకు దిగిపోయెను. అచటఁ గనిపించిన భవన మెటువంటిది? అది గారుడోత్కీర్ణము. పందిరి, ద్రాక్షతీగలు, పూనీవలు. అచ్చట ఋషులుండి రనుకొనఁడు. వెనుదిరిగి పోలేదు. అచ్చటిసౌభాగ్యగరిమ కచ్చెరువడినాఁడు. ఇంతలో మగువపొలుపు కలుపు మారుతము వచ్చినది. మఱియును దగ్గరకు వెళ్ళినాడు. వరూథిని కనిపించినది. ఇతనిని చూచుటతోడనే ఆమెస్థితి పది పద్యములలో వర్ణింపఁబడెను. ఆమెస్థితియంతయు మన్మథలక్షణముగా కన్పించునేకాని, మఱియొకరీతిగా కనిపించియుండదుగదా! తొలఁగిపోడేమి?

దారి ఎవరినో యొకరి నడిగి తెలిసికొనవలయుననిక దా! మఱియు నాకొండమీదనుండి అరుణాస్పదమునకు ఎంత

దవ్వో? దారి యె ట్లుండును? తాను నడువగలఁడా ? ఎన్నాళ్లు నడచును? ఇంకొకగతి లేదుగనుక అట్లే అనుకొందము.

"ఎక్కడి యరుణాస్పదపుర మెక్కడి తుహినాద్రి"....

ఈపరిశీలనయంతయు చేయలేనంతటి మూర్ఖుఁ డందమా ప్రవరుఁడు ! లేదా ఆసమయ మట్టి దండమా ?

ఈసంగతి న ట్లుంచి ఆమె "అంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు" నిల్చినది. ఇతఁ డామెను చేరఁజని విభ్రాంతుఁడై యన్నాడు. ఈ విభ్రాంతి దేనికి ? ఆమె సౌందర్యమును జూచియా ? ఆమె తనదారి నడ్డగించి నిలుచుటకు, తన కొకదారి యున్నదా ? కాదు. ఎవరినో యొకరిని మార్గము కనుగొనవలయును. ఈమె కనిపించినది.

"నేను ప్రవరుఁడను. త్రోవ తప్పిపోతిని. ఈకొండ మీఁదికి వచ్చినాను. మాయూ రెట్లు పోదునా ? దారి చెప్పుము" ఇవి మాటలు.

"తమయూ రేది ?" వెనుకటికి మావారికి ఉత్తరము వచ్చినదా యన్నదట ! అ ట్లున్నది. కాని ఈయడవి దాటి నచో జనపదము. దాటుట యెట్లా అని అడిగినాడు. పద్యము మొదలు పెట్టుచునే,

"ఎవ్వతె వీవు ? భీతహరి
ణేక్షణ ? యొంటిఁ జరించె
దోట లే కివ్వనభూమి ?"

ఆవిడ భీతహరిణేక్షణయైన నితని కేమి ? కాకపోయిన నితని కేమి ? భయము లేక ఒంటరిగా తిరుగుచున్నా వనెను.

ఈమూఁడుమాటలు నిస్సందేహముగా వరూథినికి ఆశ కల్గించును. మరి ఇతఁ డి ట్లనవచ్చునా? ఇక్కడ నున్నది రహస్యము. ఆమె సహజముగా భీతహరిణేక్షణ. ఇతఁ డామెస్థితిని వర్ణించినాడు. భయము లేక ఆయడవిలో తిరుగుట సాధ్యమైనపని కాదు. తనస్థితి నామెమీఁద నారోపించినాడు.

కాని గారుడోత్కృష్టమైన భవనమును చూచినాఁడు. ఆ ప్రక్కన నీమె యున్నది. ఈమెను "ఒంటిఁ జరింప దోటలేక" అనరాదు.

ఇవియన్నియు ప్రవరుఁ డూహించినాడో, లేదో! ఈ మాట లతని నోటివెంట వచ్చినవి. అతని హృదయాంతరములోని సౌందర్యాభిజ్ఞానము, సౌందర్యమును మెచ్చుకొనుట, జీవలక్షణమైన భోగాభిముఖత్వము ఇట్లు వచ్చినవి.

మఱియు నింకొక కారణ మున్నది ఆమె ఇ ట్లడిగిన ప్రవరుని స్వాభిలాషానుకూలునిగా భావించి మరికొన్ని మాట లన్నది. అప్పు డత డిట్లనెను;

"అండజయాన! నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగరాదు పోవలయు నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి మఱియొండునె భక్తియచాలు సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ చనఁగావలయుం గరుణింపు నావయిన్"

మరల 'నండజయాన' యని సంబోధన. ఇదికూడ ఆమె కాశాజనక మైనది. ఇందాకటి భీతహరిణేక్షణవంటిదే.

ఇచ్చట నున్నాడు పెద్దనగారి వైష్ణవబ్రాహ్మణ యువకుఁడు. శిష్యులు, శిష్యురాండ్రు - వారితో మాటాడెడి

మాటలు - ఇది ప్రవరుని వాగ్రూపమైన సృష్టి. ఈ సపర్యలు మాకు వచ్చినవి. నేను వచ్చిన వొకటియు, రాకపోయిన నొకటియా? నీ భక్తియే చాలును. నాకు సత్క్రియా కాండము కలదు ... ... ఈ మాటలు ఎవ రనునవి? నిర్మముఁడై లోకమునందలి భోగములు తెలిసి, సౌందర్యము యొక్క యభిజ్ఞ కలిగి, సౌందర్యమును సౌందర్యముగా భావించి చూచి మాటాడఁగలిగిన యొక గొప్ప లౌకికుఁడైన పురుషునిలక్షణ మిది. సౌందర్యమును సౌందర్యముగా చూచును. చూచిన సౌందర్యమును నోటితో చెప్పును. అతని సౌందర్యోపాసన అంతవఱకే. ఇది ఇతరులకు దురభిప్రాయ ములను కలిగించును.

ప్రవరునిశీల మిది.

మఱియు నామె దేవతాస్త్రీ యని తెలిసెను. "మీ మహత్త్వములు దివ్యములు. మీకసాధ్యములు లేవు." మొద లైన ప్రసక్తి చేసినాడు. ఆమె తన మనస్సును చెప్పివేసినది. అతఁడు 'వ్రతులై దినములు గడపెడి విప్రులఁ జనునే కామింప మది విచారము వలదే!' "నేఁడు నేనిలు సేరకుండినచో సమస్త ధర్మములు తూలు" ననినాడు. వెంటనే ఆమె మొగమున చిన్నబాటు కనిపించినది. ఆమె కీసంగతులు తెలిసినవియే. అతనిని వశపరచుకొనుటకు మఱియొకమార్గము త్రొక్కినది. తనతోడిభోగము సశరీరస్వర్గ మన్నది.

ప్రవరుఁడు "నీ వన్న యర్థమెల్ల కాముకుఁడైనవాని నిజము" అనినాడు. తా నకాముడుగనుక దీనిని గణించ

వన్నాడు. ప్రవరునిరహస్య మిచ్చట నున్నది. అతఁడు భోగ విముఖుఁడు గాడు; అధర్మవిముఖుఁడు. సౌందర్యము నెఱుంగనివాడు కాడు ; అది యున్నదని యధర్మము చేయఁడు. రసహీనుడు కాడు, అగ్నిహోత్రి. అతనిలక్ష్యము :

"బ్రాహ్మణుఁ డింద్రియవశగతి" చెడిపోవునని. తా నింద్రియవశుఁడు కాడు. వచ్చేదు నూహాలు వేఱు. వాని నింద్రియదశకు తెచ్చుట వేఱు. ఊహాలు వచ్చును. అవి వట్టి యూహాలు. ఆయూహాలు ఊహాలుగా నుండుట యొక స్థితి. క్రియాభిముఖములై యుండుట మఱియొకస్థితి. రెండవది దోషము, మొదటిది వివేకము.

ఇప్పటికి వరూథిని యొక్క సర్వాశలు తునిగిపోయినవి. అతడు బ్రహ్మానందాధిరాజ్యపదవినిగూర్చి మాటాడుచున్నాడు. అత డగ్నిహోత్రియగుట, క్రతువులు చేయుట, స్వర్గభోగముల యందలి వాంఛచేతఁ గాదు. నిష్కామముగా చేయుచున్నాడని తేలినది. అతఁడు వాంఛించునది బ్రహ్మపదము.

అపుడు వరూథిని ఉపనిషద్వాక్యమునకు దుర్వ్యాఖ్యానము చేసినది. కాని ఆ నిముసములో ఒడఁబఱచుచున్నదా యన్నట్లున్నది. ఆమె చేసిన తెలివితక్కువ తత్తరపడుట. ఆ తత్తరములో ఇంద్రియ వశత్వము గోచరించినది. ఇతనికి జాగ్రత్త వచ్చినది.

'ఇవియా మీసంప్రదాయార్థముల్ ?' అన్నాడు.

ఈఒక్కమాటతో పెద్దన్నగారు భారతీయ మతము యొక్క ఆయువుపట్టును పట్టుకొన్నాడు. సంప్రదాయార్థము

వేఱు. వివేకముచేత కల్పించు నర్థము వేఱు. లోకములోని అన్నివాక్యములకు పెడయర్థములు చెప్పవచ్చును. సందర్భశుద్ధిగల యర్థ మొక్కటియే యుండును. అట్లే వేదోపనిషదాదివాక్యములకు భిన్నార్థములు చెప్పవచ్చును. నేడు జరుగుచునేయున్నదిగదా! సంప్రదాయార్థ మొక్కటియే. ఈ మహావిషయమును పెద్దన్నగారు రూఢిపఱిచిరి.

తరువాత నామె యాతనిని గౌగిలింపఁ బోయినది. వ్యాస, విశ్వామిత్ర, మాందకర్ణి, మొదలైన ఋషుల కథలు చెప్పినది. అతఁడు ఏమియు ననక తన శరీరము కడిగికొని, గార్హపత్యాగ్నిని పొగడి వెడలిపోయెను. అతఁ డెంత గడుసువాఁడో, పరిస్థితి నెంత చక్కగా నర్థము చేసికొనఁగలవాఁడో, ఎప్పుడు మాటాడునో, ఎప్పుడు మాటాడఁడో, ఎంత కొద్దిగా మాటాడునో, మాటాడుటలో ఆయనయూహిపరిస్థితి, ఆయన పరిస్థితియు కనుపించుట మొక్కటియే యున్నది.

ఇది యంతయు మానవధర్మశాస్త్రమునకు పునాది.

౬

ఒక గ్రంథము చదువునప్పుడు తద్గతకథోచితముగ పాఠకుఁ డూహించవలయును. అప్పు డాకథలోని సౌందర్యము భాసించును. ఏకథయైనను లోకమునందలి సన్నివేశమును గుఱించియే యుండును. లోకాతీతములైన విషయము లెప్పుడో యుండును. కాని మహాకవుల కథలలో లోకగతమై, లోకోత్తరములైన విషయము లుండును. పూర్వదృష్టికి, నాధునిక

దృష్టికి నిదియే భేదము. లోకగతములై, సామాన్యములైన విషయములే యాధునికులకు రుచించును. వారు వానినిగురించి వ్రాయుదురు. పూర్వులు లోకగతములయ్యు, విశిష్టలక్షణములు గలిగిన వ్యక్తులకు సంబంధించిన కథలనే నిరూపింతురు. ఏజాతియందైనను మహాకావ్యములు తాదృశులైన వ్యక్తులను గురించియే యుండును. షేక్స్పియర్ వ్రాసిన 'హామ్లెట్' తీసికొందము. హామ్లెట్ వంటివాఁ డుండును. పదివేలమందిలో నట్టివాఁ డొకఁడు. పూర్వమహాకవు లట్టివిషయములను దీసికొనెడివారు. అట్టివారికథ చిత్రించుటవలన లోకమున కొక లక్ష్యము నిరూపింపఁబడుచున్నది. రెండవది యీసృష్టిలోని తెగఁద్రెంచరాని యొక విలక్షణమైనదియు, మనుష్యబుద్ధి కతీతముగా నున్నట్లు కన్పించునదియు నైన సృష్టియొక్క రహస్యము చెప్పఁబడుచున్నది.

ఇట్టి పూర్వమహాకవులలోసైతము భేదము కలదు. ఒకఁడు బహువిషయములను వాచ్యములు చేయును. ఆ వాచ్యము చేసి రచించిన కవియొక్క శిల్పము వేఱేచోట యుండును. మఱియొక్కఁడు వాచ్యము చేయక కథాగతవిషయములుకూడ పాత్రపోషణాదివిషయములుగూడ వ్యంగ్యములుగాఁ జెప్పును. ఈరెండవకవియొక్క కావ్యము చదువుట కష్టమైన పని.

సంస్కృతనాటకసారస్వతములో వసంతసేన యున్నది. ఈమనుచరిత్రలో వరూథిని యున్నది. వసంతసేన చారుదత్తుగతైకమనస్క. నాటకమంతయు నావిషయమే యున్నది.

ఆమెయొక్క పరమసద్గుణము లన్నియు వాచ్యములుగా నాటకముమీఁద పలుచఁబడినవి. అచట నట్లు చేసితీరవలయును. ఎందుకనఁగా నాటకము రసప్రధానమైనది. రసోదయమునకుఁ బూర్వము నాయికానాయకుల పరస్పరనిపిష్టసంపూర్ణభావములు సువ్యక్తములైననే, రస మారంభించును. అందుచేత వసంతసేన సంపూర్ణముగా చారుదత్తునిగుణముల కమ్ముడువోయిన దని వాచ్యము చేసితీఱవలయును.

వరూథిని విషయములో నట్లు కాదు. ఇది ప్రబంధము. ప్రబంధము వర్ణనాప్రధానమైనది. రసప్రధానమైనది కాదు. ఇచట కథాగతశిల్పము మిక్కిలి ప్రధానమైనది. వరూథిని యందు వసంతసేనాగతలక్షణము లున్నచో నది యిచ్చట వ్యంగ్యమానములుగాఁ జేయుట కవియొక్క శిల్పము.

పెక్కుమంది, వసంతసేన వారకాంత యగుటచేత నామె బహుపరపురుషసంగమపరిజ్ఞానము కల దనియు, చెడిపె యనియు మొదలైన సామాన్యనాయికలలెక్కలో కట్టి చెప్పుటయు, వ్రాయుటయుఁగూడ జరిగినది.

ఒకానొకకవియొక్క రచన ఒకానొకవిధముగాఁ జదువవలయును. పెద్దన్నగారిరచన యొకవిధముగాఁ జదువవలయును. ఆవిధ మీవఱకే యైదువ్యాసములయందుఁ జూపింపఁబడినది. ఈ వరూథినినిగూడ ఆదృష్టితోఁ జూడవలయును. అనఁగా ఆవరూథిని యెట్టిదో, ఆమెశీల మెట్టిదో, ఆమె లక్షణ మెట్టిదో - పెద్దన్నగారు కొన్నిచోట్ల రహస్యముగా, కొన్నిచోట్ల సన్నివేశవ్యంజకముగా నిరూపించినాఁడు.

అన్నింటికంటె మొదల ఆమె వారకాంత యనుట నిస్సంశయమైన విషయము. ఎంత ఏకపురుషనిష్ఠచిత్తయైనను జన్మలక్షణము కొంత యుండును. ఏకపురుషమనస్కయైన వరూథినియందు తజ్జన్మసిద్ధమైన వారకాంతలక్షణము సువ్యక్తముగనే కన్పించుచున్నది. ఈ వ్యక్తముగా కనిపించిన దానినిబట్టి సర్వము నూహించుటయా? తక్కిన కథయంతయు నచ్చటనున్న సన్నివేశముమీఁద నాధారపడియుండవలయును గాని పాఠకుని యథేచ్ఛామనోవృత్తిపై నాధారపడి యుండ గూడదు.

తొలుదొల్త నొకవిషయము విచారింతము. ఈ వరూథిని హిమాలయపర్వతముమీఁదఁ నున్నది. అచ్చటి కూరకే రాలేదు. అచట నొక గారుడోత్కీర్ణమైన సౌధమును గట్టి కొని యున్నది. ఆ కట్టుకొనినచోట ఒక గంగపాయ మలకలై కొండలలోనుండి దిగుచున్నచోటు. అచ్చటికి పోవుటకు మణులతో కట్టిన మెట్లున్నవి. రెండువైపుల మల్లెతీగలున్నవి. అవి పూచినవి. ఇట్టిమేడ కట్టుకొని యామె హిమవత్పర్వతముమీఁద నివసించుచున్నది. అనఁగా స్వర్గమును వదలిపెట్టి వచ్చినది. అచ్చట తనవృత్తి చేయుట కిష్టము లేక యిచ్చటికి వచ్చియున్నదేమో! అందుచేత నామె వారకాంతయయ్యును వారకాంత కాదు.

ఆమెను చాలమంది వలచిరి. ఆమె వారిని తిరిగి ప్రేమించలేదు. దీనికి ప్రధానసాక్ష్యము.

ఏగంధర్వుఁడు తద్విలాసములు ము
స్నిత్యించి తా నెంతయున్
రాగాంధుండయి కోరి హత్తక కడున్
రారాపులన్ కంతుఁడు
ద్వేగం బందఁగజేసినాడో...
వాఁడే సాక్ష్యము.

తక్కినవారు నామెను కోరిరి. ఏ డొక్కఁడే యామెను గాటముగా వలచెను. వానినిగూడ నామె యంగీకరించలేదు.

ఈమె వారకాంతావృత్తి నంగీకరించినది కాదు. ఆమె మనమ్ము సామాన్యమైనది కాదు. ఆమె ఒక్కప్రవరునే భావించెను. తత్పూర్వ మేపురుషుని నామె వాంఛించలేదు. వాంఛించినచో నామె గంధర్వునితో సంసారము చేసెను గదా! గర్భవతి యయ్యెనుగదా! శిశువును కనెనుగదా! వాఁడు మహారాజయ్యెను. ఆమె శతవిధాల కొడుకుకడనే యుండియుండును. ఇట్టిది జరుగదు. ఉండకపోయినను సంసారము చేయుటయు, బిడ్డను కనుటయు స్థూలదృష్టికైనను నొకయేడాది యేణ్ణర్థము కాలము పట్టును. ఆమె నిజముగా వారకాంత వృత్తిగల స్త్రీయైనచో నామెయొక్క ప్రాత భోజుంగులు వదలిపెట్టరు. తత్ప్రసక్తియే లేదే! అందుచేత నీ సంగతియే నిశ్చితమైనదిగా కనుపించుచున్నది.

పెద్దన్నగారేదియు వాచ్యముగాఁ జెప్పఁడుగదా? ఇదిగో యీసంగతిని వ్యంగ్యముగాఁ జెప్పినాఁడు.

తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితోనని రోషభీషణ
స్ఫురణవహించెనో యన నభోమణి దాల్చెఁగషాయదీధితిన్

ఈమె అనన్యకాంత. ఈ 'అనన్యకాంత' యన్నమాటకు పదిమంది పదియర్థములు వ్రాయవచ్చును. తత్కాలమునం దతనినే భావించుచున్న దనియైన, ఆమె వారకాంత యగుటచేత ఏపురుషునకును భార్య కాదనియైన – ఇట్లు వ్రాయవచ్చును. కాని పెద్దన్నగారిభావము ఇంతకుముందు వ్రాసిన సర్వలక్షణములామెయం దునికిని చెప్పుచున్నది. ఎట్లనగా ఈపద్యములోని భావము చూడుఁడు. అట్టి స్త్రీని అంగభవుబారి కగ్గముసేసి, అహంకృతితో మహీసురాధముఁ డరిగెనని సూర్యుఁడు రోషపడి ఎఱ్ఱవడినాఁడని చెప్పెను. ఆపరమోత్తముఁడైన ప్రవరాఖ్యుఁడు మహీసురాధముఁడు. ఇందులో సూర్యునకుఁ గోపమువచ్చును. ఇది ఉత్ప్రేక్షాలంకారము. అలంకారగతాన్యవస్తువునకు ప్రాధాన్యముండునా యన్నచో మహాకవులయం దుండును. వా రుత్ప్రేక్షచేత, ఉపమచేత, రూపకముచేత, తమకావ్యవస్తువులను దీపింపఁ జేయుదురు. వస్త్వాదులనుగూడ వ్యాజ్యమును చేయుదురు. దీనికి కాళిదాసుయొక్క యనంతములైన యలంకారము లుదాహరణములు. ఉత్ప్రేక్ష ఉపమాకోటిలోనిది.

ఇప్పుడు కోపించినవాఁడు సూర్యుఁడు. ఇతఁడు మహీసురాధముఁడు, ఈ స్వారోచిషమనుసంభవగతమహాకథాదృష్టితోఁ జూచినచో సూర్యునకుఁ గోపము వచ్చినదని యుత్ప్రేక్షించు

టలోఁ దప్పు లేదుగదా? మనువు కలుగఁబోవుచున్నాఁడు-ఒకమనువు తననుండి కలిగినాఁడు. అతఁడు వైవస్వత మనువు. ఈప్రవరవరూథినీసమాగమమునుండి సంభవింపగలఁ స్వారోచిషమనువు సంబంధమైన వీరి కలయిక నూర్యునకు నభిమతమైనదికదా? ఇపుడు మహీసురాధముఁడన్న శబ్ద మెట్లు? ఈసందర్భములో నతఁడు మహీసురాధముఁడే! ఎందు కనఁగా నతఁడు కర్మిష్ఠిగాని, జ్ఞాని కాడు. అతని 'కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైన ట్లన్యముల్ గావు' అతనికి వరూథినీగర్భమున స్వారోచి పుట్టుననిగాని, అతఁడు స్వారోచిష మనువునకుఁ దండ్రి యగుననిగాని ఈ మహా జ్ఞానము లేదు. తద్దృష్ట్యా, మహీసురాధముఁడు; ఇతఁడు మహీసురాధముఁ డనుకొన్నది యెవరు? భగవంతుఁడైన సూర్యుఁడు. నీవును, నేనును కాము.

ఈపద్యములో వరూథిని యొక్క జన్మస్థితి రహస్య మంతయు పెద్దన్నగారు నిక్షేపించిరి. అనన్యకాంత యన్న మాటకు దురర్థము చెప్పరాదు. ఆమె వారకాంత కాదు. అన్య పురుషగతమనస్క కాదు. అందుకనియే హిమాలయ మున వచ్చి యిల్లు కట్టినది.

ఒకమనువు ఆమెగర్భము కాఁబోవుచున్నాఁడు. ఆ మహాసృష్టి కామె పునాది యగుచున్నది. అందుచేత పరమేశ్వరుఁడుగూడ నామెను సామాన్యవారకాంతను జేయఁడు. ఆమె సృష్టి యట్టిది కాదు.

కాని యీయామెకు భోగదృష్టి కలదు. ఆమె యొక్క విచిత్రమైన శీలముకలది. విచిత్రములైన మనోభావములు కలది. మిక్కిలి స్వతంత్రురాలు. ఆమెకుఁ గొన్ని సిద్ధాంతములు కలవు. ఈలక్షణములు కలదికనుకనే వచ్చి యిచ్చట చేరినది.

1. ఆమెకు తాను దేవతా స్త్రీనని యహంకారము కలదు. తనజాతియొక్క విద్యావైభవములయందు అభిమానము కలదు. ఆవిద్యలయందు పరమానురాగము కలదు.

చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు,
రహిఁ బుట్ట జంత్రగాత్రముల రాల్గఁరగించు
విమల గాంధర్వంబు విద్య మాకు,
ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినది మాకు,
హయమేధ రాజసూయము లనఁ బేర్వడ్డ
సవన తంత్రంబు లుంకువలు మాకు;

గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు,
పద్మసంభవవైకుంఠభర్గసభలం
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర!

ఈపద్య మామెకు తనపుట్టిన వర్ణమునందుఁగల యభిమానమును సూచించుచున్నది. కాని తనజాతియొక్క సంగీతాదివిద్యలయం దభిమానముకాని, వృత్తియందు

కాదు. ముడి యిచ్చట నున్నది. పాఠకుఁడు దీనిని చూడ వలయును.

2. ఆమె కింకొక మనోలక్షణము కలదు. ఆమె దేవతాస్త్రీ. దేవతలు భోగలక్షణము కలవారు. ఆ భోగలక్షణముయొక్క మూర్తియే జాతి. ఆమెయొక్క భోగలక్షణమైన మనోవృత్తి రసభావ సమన్వితమైనది. అందుకనియే

ఎన్నిభవంబులం గలుగు నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడివత్తలయి కేలఁ గపోలము లూది చూపులన్
విన్నఁదనంబుఁ దోఁపఁ గను వేఁదుఱునం బయి గాలి సోకినన్
వెన్నవలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్.

అని చెప్పినది. అనుభావవ్యభిచారభావసామగ్రినివిష్టమైన యీమె యీ లోతుగుండె యీమెవైలక్ష్యమును జెప్పు చున్నది. స్వర్గమునందలి భోగమాత్రమైన భోగమునం దామె కిష్టము లేదు. అందుకనియే యిచ్చటికి లేచివచ్చినది.

3. మఱియు నామె పండితురాలు. ఉపనిషత్తులుగూడ రసబుద్ధితో వ్యాఖ్యానము చేసికొన్నది. ఇది యీమె దేవతాస్త్రీ యగుటలోని లోపము. దేవతాబుద్ధి యంతకుమించి పోదు. బ్రహ్మవిషయక జిజ్ఞాస మానవుల కున్నంత దేవతల కుండదు. వారు భోగపురుషులు. ఆ నియమితమైన భోగ మనుభవించుటకే వారి జన్మ. ఇట దేవతలకంటె మానవుల యాధిక్యము. అందుచే నామె యువనిషత్తులను స్త్రీపురుష సంగమజనితోత్కృష్టతృప్తిపరముగా 'ఆనందో బ్రహ్మ' యన్న వాక్యమును వ్యాఖ్యానము చేసినది. ఇట్టివ్యాఖ్యాన

మాధునికులలో కొందఱు చేయుచున్నారు. భోగపర్యాప్తమైన లౌకికసుఖసాధనములు కలవారు తప్పకుండ నిట్టి వ్యాఖ్యానములుచేయుచుందురు. ఇట్టిలక్షణము దేశతలయందెందుకు లేదు ? అందులో నామె జన్మచేత వారకాంత.

4. ప్రవరుఁడు దయావిహీనుఁడన్నది. అతనినిర్దయ తన్ను ద్రోసి వేయుట. తాను కోరినది నిరాకరించుట. ఇదియొక విచిత్ర వ్యాఖ్యానము. ఎల్ల కాలమునందు నిట్టి వ్యాఖ్యానములు చేసెడివారుండ నేయుందురు. అప్పుడని, యిప్పుడని లేదు. అప్పటి భావములు వేఱని, యిప్పటిభావములు క్రొత్తయని యుండదు. తత్తత్కాలములయందు సుఖసాధనములయొక్క విలక్షణత్వము, నూత్నత్వ ముండునుగాని, సుఖవాంఛయొక్కయు, మానవునిమనస్సుయొక్కయు లక్షణము లొకతీరిగా నుండును. కాలములు మానవునిమనస్సును మార్చవు. ఆమనస్సున కవలంబములైన విషయములయందు మార్పు వచ్చును. అప్పుడు రెండెడ్లబండిమీఁద పోవచ్చును. ఇప్పుడు రైలుమీఁదనో, విమానముమీఁదనో పోవచ్చును. పోవునది ప్రియాసంగమముకొఱకైనచో వాంఛాస్వరూప మొకటియే, భావనాలక్షణ మొకటియే.

ఆమె యిట్టియిట్టి లక్షణములు కలది; సంగీతము, సాహిత్యము, దయ, తృప్తి లక్షణము. ఏతాదృశవిషయములనుగుఱించి యాలోచించి, యొకనిశ్చయము చేసికొని, ఆలక్ష్యమునుగూర్చి జీవితము పుచ్చుచున్న వ్యక్తి.

ఆమెమనస్సు పండినది. ఆమెకంటికి నచ్చిన పురుషుఁడు దొరకలేదు.

" సురగరుడోరగనరఖే
చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల..."

చూచుచునే యున్నది. వేనిమీఁదను ఆమెమనసు తగుల లేదు. సౌందర్య మనినంతనే ఆమె కొకవిలక్షణమైన యభి ప్రాయము కలదు. అట్టిసౌందర్య మామె చూడనేలేదు. అట్టిపురుషుఁడు కనిపించిననే యామె తనజీవితమును సార్థక పరచుకొనును.

ఆమె ఏకాద్యగ్నిశిష్ట మనోలక్షణములు కలదని చెప్పు టకు మఱియొక పెద్దహేతువును పెద్దన్నగారు నిక్షేపించినారు.

ఏవిహంగముఁ గన్న నెలిగించుచును సారె
కును సైకతంబులఁ గూడఁ దారుఁ
దారి కన్గొని యది తనజోడు గాకున్న
మెడ యెత్తి కలయంగ మింట నరయు,
నరసి కన్నీటితో మరలి తామర యెక్క
వదన మెండఁగ సరోవారి నద్దు,
నద్ది త్రావఁగ నైప కట్టెట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యురుకు,

నుఱికి యెఱకలు దడియ వేఱొక్కతమ్మి
కరుగు నరిగి రవంబుతోఁ దిరుగు జేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజ బ్రియుఁ బాసి వగ నొక్కచక్రవాకి.

ఇది చక్రవాకి. చక్రవాక పక్షులు మిశ్రసంయోగము చేయని జాతి. ఈవర్ణనముచేత పెద్దన్నగారు వరూథినీలక్షణ మును జెప్పుచున్నారు. మఱియు నామె పట్టివారకాంతయే యైనచో నీకావ్యమునందలి చంద్రదూషణము, మలయానిల దూషణములలోని యౌచిత్య మేమి? అనఁగా నవి యుద్దీపన విభావములుగనుక ఏస్త్రీకిఁబడిన నాస్త్రీకి నుండునా? ఉత్తమ నాయికాగతమయియే యుండునా? ఇది విభావాది సామగ్రీ రహస్యపర్యాలోచనకు సంబంధించిన విషయము. సామాన్య నాయిక, బహుపురుషసంగమము చేయునది, అది యొకపురు షునిగూర్చి యింత దుఃఖించదు. ఒకవేళ దుఃఖించినచో దాని యందీగాఢత్వ ముండదు. ఈయౌచిత్య ముండదు. రస సిద్ధాంతనిర్మాతలైన భరతాదిమునులు దీని నట్లు భావించి యుండరు. బహుపురుషసంగమముగల స్త్రీ అంతమందిలో నొకనికొఱకు విరాళి పొందుచున్న దనఁగా పాఠకునియందుఁ గాని, సామాజికునియందుగాని రసోదయము కల్గునా? హాస్యము పుట్టునా? వరూథినియొక్క శీలరహస్యము పెద్ద న్నగారీవిరహామునందు నిగూఢముగా నుంచినాఁడు, ఈసంద ర్భము లన్నియు మనస్సులో పెట్టుకొని వరూథిస్ప్రవరాఖ్య సమాగమము పర్యాలోచింపవలయును. ఆమె ప్రవరాఖ్యు నితోఁ గలసిన సమయ మెట్టిదో విచారించవలయును. ఆమె చిత్తవృత్తియొక్క సామాన్యలక్షణములే యింతవఱకుఁ జూచితిమి. తత్సమాగమకాలమునందలి యామెపరిస్థితికూడ చూచినచో విశదము కాఁగలదు.

ఆమె తనకంటెకి మిక్కిలి యింపైనపురుషునే భావించు చున్నది. అతఁడు కృచ్ఛ్రలభ్యుఁడుగా నున్నాఁడు. ఈమె యో తన సౌందర్యము, తనపాండిత్యము మొదలైనవన్నియు వ్యర్థములై పోవుచున్నవన్న భావమూ కలది. తా నొకలక్ష్యము పెట్టుకొని, దానిప్రకారము భోగసాధనములను నిర్మించికొని బ్రతుకు చున్నది. వేఱ మేడకట్టుకొన్నది. ఒకరమణీయమైన ప్రదేశమున కట్టుకొన్నది. దానికి చుట్టు పూలతీగలు. మెట్లు మణులతో చేసినవి. తాను దుస్తులు ధరించును. తాను సౌందర్యవతినని తా నెఱుఁగును. తనసౌందర్యమున కనుకూలమైన దుస్తులు ధరించును. గొప్ప భోగలాలసు రాలు. సంగీతము తాను పాడఁ గలదు. వీణ వాయించును. వీణాధ్వనిలో తాను లీనము కాఁగలదు.

ప్రవరు నామె చూచినవేళ అట్టిది. ఆమెమనస్సు భోగముయొక్క యుత్కృష్టస్థితియందు లగ్నమై యున్నది. తాను భావించిన పరమసుందరుఁడు, వాఁ డెవఁడో, వానితో మనస్సులో రమించుచున్నది.

ఆలాపగతిఁ జొక్కి యరమోడ్పుకనుదోయి
రతిపారవశ్యవిభ్రమము దెలుప.

ఆకనుదోయి ఆవిభ్రమమును తెలుపుచున్నది. అట్లున్న దని యర్థమా ? తత్కాలమునం దామె మానసికముగా నట్టి స్థితి ననుభవించి తద్గతపారవశ్యము నే ప్రదర్శించుచున్నదనియా? ఈకనుదోయి ఆలాపగతిచేత చొక్కుటచేత కలిగినదా ? మానసికమైన రతిపారవశ్యమును తెలుపుచున్నదా ? అన్నమాట.

ఇక్కడ 'చొక్కి' అన్న క్త్వార్థము హేత్వర్థమందుఁ బ్రయోగింపఁబడినదని చెప్పకతప్పదు. అరమోడ్పుకనుదోయికి ఆలాపగతిచేత చొక్కుట హేతువు. ఇందులో 'తెలువక' అను ధాతువు సామ్యలక్షణస్ఫోరకమా? యథార్థవిషయ కథనమా? అప్పు డాలాపను చేయుచున్నదికనుక చొక్కుట దానియందే- అన్న పాధాన్యవివక్ష వచ్చును. కాని తెలుపు ధాతువు ప్రయోగించుటలో నున్న వైలక్షణ్యము రతిపారవశ్య మునకును ప్రాధాన్యము కలిగించును.

ఇట్టి స్థితిలో ప్రవరుఁడు కనుపించినాఁడు. అతఁడు కనుపించినంతనే—

'అబ్బురపాటుతోడ నయనాంబుజముల్'

వికసించినవి. అనఁగా నామె కాశ్చర్యము కలిగినది. ఈ ఆశ్చర్య మెందుకు కలిగినది? ఇన్నాళ్ళుగా తా నేసౌందర్య మును భావించుచున్నదో, ఏసౌందర్యము తా నెప్పుడును 'పురుషగతమై చూడలేనని నిశ్చయించుకొన్నదో, ఆసౌంద ర్యముగల పురుషుఁ డెదురుగాఁ గనిపించెను. ఇందుకనియా అబ్బురపాటు? లేదా అట్టిసుందరుఁడైన పురుషునితో తాను మానసికమైన భోగ మనుభవించుచు, రతిపారవశ్యమును పొందినది. తనమనస్సులో నున్నవాఁడే ఎదురుగా కనిపించుట చేతనా?

ఆమె అతనిని జూచినది. పోయి పోకచెట్టువెనుక నిలు చున్నది. సందేహపడినది. అతనిసౌందర్యము నెంత త్రావినను ఆమెకు తనివి తీరలేదు. ఆమెమనస్సే ఆడుచుండుటలేదు.

ఆరుపద్యములలో ఆమెఅప్పటిస్థితినే పెద్దన్నగారు వర్ణించిరి. అనఁగా దిగ్భ్రాంతురాలై పోయినది. అప్పు డామె మన స్పాడినది. తరువాత మూఁడుపద్యములలో నామె మనస్సులోనికి వచ్చిన యూహాలు చెప్పఁబడినవి. తాను పోయి వాని కడ్డముగా నిలుచున్నది. ఇది తప్పా ?

గుణదోషములు విచారించుటకుముందు తత్తత్పాత్రల యొక్క స్థితిలో పాఠకుఁడు తన్నుంచుకొనవలయును. ఒకస్త్రీ ప్రవృత్తి మఱొకస్త్రీ కెక్కువ తెలియును. లోకమునందు మానవులు తమకు సంబంధించినంతవఱకు తమ ప్రవర్తనను విచారించి చూచుకోరు. ఇతరులయందు నీతిసూత్రముల వట్టింతురు. మానవుని భావనాలక్షణములో నీతియు, ధర్మము, దేవుఁడు మొదలైనవి తనప్రవృత్తికి, తననడకకు సంబంధించన ట్లుండును. అది వేఱే లోకము. ఒకొక్క కావ్యము నట్లు చదువరాదు.

ఎన్నేండ్లుగానో తాను భావించుచున్న యొకానొక సౌందర్యము తాను తనయొడలు తనకుఁ దెలియక యొక తన్మయస్థితిలో నుండఁగా కంటికి కనిపించినప్పుడు, ఆమెకు విచారణ ఎక్కడిది ? అప్పుడు మనస్సే లేదు. ఇన్నాళ్ళనుండి గూడుకట్టుకొనియున్న తనవాంఛయే పరమబలిష్ఠమై యుండును. మఱియు నామె తాను దేవతాస్త్రీనని, తాను మహావిద్యావతినని, పరమసౌందర్యవతినని, పలుమంది తన్ను వాంఛించిన హేతువుచే తా నేపురుషుని భావించునో, వాడుఁగూడ నట్టిస్థితిలోనే యుండునని, ఇతఁడు బ్రాహ్మణుఁడు

గనుక బ్రాహ్మణుల యజ్ఞకర్మలు రంభాద్యప్సరస్త్రీసంభోగ ఫలములుగనుక తాను కోరుటయు యాలస్యముగా నతఁడు తన్ను జేపట్టునన్న యూహకలది. ఆమెవైపుననుండి యన్నియు సుసంగతములే. ఆమె భావించని ద్రొక్కటే విషయము. ఆ విషయములో నామె భావించనట్లే కొంద ఱాధునికులు భావించుచున్నారు.

బ్రాహ్మణులు యజ్ఞయాగాది క్రతువులు చేయుట రంభాద్యప్సరస్సంయోగముకొఱకు. ఇది కామము. ఇది తుచ్ఛము - అన్నది యొకటి. రంభాద్యప్సరస్త్రీలుగూడ వారకాంతలేకనుక నీచస్త్రీలు - ఇది యొకటి.

రెండవదానిని జూతము. రంభాదులు దేవతాస్త్రీలు. వారున్నారని నీవొప్పుకొన్నచో, వారు నీకంటికి కనుపించరు. వారు నిన్ను శపించగల్గుదురు. వారకాంతకు శాప మీయఁగల శక్తియా? రెండును పొసఁగవే! వారు నీ వనుకొన్న వారకాంతలు కారేమో? ఇచ్చట యజ్ఞయాగాదిక్రతువులు, తత్ఫలితములు, వాని చిత్రవిచిత్ర లక్షణములు, ఊర్ధ్వలోకములు మొదలైనవాని మహాతత్త్వవర్యాలోచన చేయవలయును. నేడు మన మనుకొనుచున్న కొన్నిభావము లక్కడ పట్టించుట కాదు.

మఱి యింక ఆయప్సరస్త్రీసంయోగముకొఱకు యజ్ఞము చేసినాఁడు. మఱి ప్రవరుఁడు - అది లభించినది కదా? ఎందుకు వంగలేదు? ఇది ఇట్టివాదనకు పెద్దన్నగారి సమాధానము. ఆయజ్వ ఏకభార్యుఁడు. ఆశరీర మున్నంత

వరకు తదితరభోగవాంఛ లేనివాడు. రంభాదిగతవాంఛ తేజోలోకములయందలి విషయము. సామాన్యముగాఁ జూచినచో నెవనికైనను దాన విచ్ఛిన్నచో ఆ ముందుజన్మలలో నుపయోగపడునని. అట్టిఊహామీద నడచినచో రంభాదిభోగము కొంత యర్థము కావచ్చును.

'ఆనందో బ్రహ్మ' యన్నచోట, ఈవరూథిని మనోవాగ్గుణములు ప్రపంచించుచోట పెద్దన్నగారు తత్కాలమున నున్న కొందఱు ఇట్టియూహాలు సేయువారి నుద్దేశించి ఈ కావ్యమున వ్రాసెనేమో! ఆది సువస్వంత్రమైన రాజ్యము. సంపద ఎన్ని వెఱ్ఱియూహాలకైనను దారి తీయును.

ప్రవరుఁడు "అండజయాన" "భీతహరిణేక్షణ" అని యామెను సంబోధించుటచే నీమె కాశ కలిగినది ఆసంబోధించుట పాప మాతఁడు తనప్రకృతిసహజముగా చేసెను.

అతఁడు తనయింటిదగ్గఱ తల్లిదండ్రులు వృద్ధులని మొదలైనది చెప్పుకొనుటకు నామె కతని తత్త్వమే తెలియ లేదు. కాని ధైర్యము పోలేదు. అందుచేతనే ఆమె మొగము నందు చిన్నబాటుమాత్రమే కనిపించినది.

పాప మప్పటి యామెస్థితి, ఆమెయొక్క సర్వభావన, సర్వమైన చిత్తవృత్తి తత్కాలమునందలి యామె పారవశ్యస్థితి - సర్వమును వృథా యైనవి.

ఈరీతిగా వరూథిని ఇట్టిలక్షణములు కలదానినిగా ప్రవరుని యట్టిలక్షణములు కలవానినిగా చిత్రించి పెద్దన్న [illegible] శిల్పసృష్టిని జేసెను.

# ౭

## కథాకథనశిల్పము

ఈకథాకథనశిల్ప మన్నమాట కొంతవఱకుఁ గ్రొత్తది. 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' యని నన్నయ్యగారు వాడిరి. తర్వాత నెవ్వరును దీనివంకఁ జూచినట్లు కానుపించదు అయినను ఈకథాకథనశిల్పము ప్రౌఢులైన కవులయందు కనుపించక పోదు. కథ చెప్పుటలో నొకశిల్ప మున్నదని గుర్తించినవారి సంఖ్యయే తక్కువ యని చెప్పవచ్చును.

కళాపూర్ణోదయములో నీప్రయత్నము చాలఁ గలదు. కాని యందలి కథాకథనవైఖరిని, ప్రసన్నతను మాలి క్లిష్ట లక్షణమును సంపాదించినది.

కొందఱు కవులు నాటకీయముగా కథాసంవిధానము చేయుట కలదు అనఁగా నాటకమునందువలె రసవద్ఘట్టము తీసికొని యారంభించుట. విష్కంభప్రవేశకములలో చెప్పఁ దగిన కథను పరిత్యజించి కావ్యాది చేయుట. ఈపద్ధతి ప్రభావతీ ప్రద్యుమ్నములోఁ గొంత కలదు. నాటకీయముగా కథాశిల్పమును జేయుట యనఁగా ఉపశ్రుతి, సూచ్యార్థసూచనము, చూళికాదులు మొదలైనవానినిక్షేపము చేయుటయో, లేదా తద్వాసనాభరితముగా కథను నడుపుటయో యగును. ఆధునికులు కొందఱు ఉక్తిప్రత్యుక్తికావైఖరీసమేతమైన తెనుఁగురచనను నాటకీయముగా నుండెనని చెప్పుచుండిరి. ఇది యంత సమంజసము కాదేమో! మఱియు నీయుక్తిప్రత్యుక్తికావైఖరి

వృత్తవర్తిష్యమాణకథాంశములు లుప్తములో సూచితములో కారచించిన నది మఱియు నాటకీయరచనగా ననుకోవచ్చును.

ఏది యెట్లైనను ఇది కథాకథనశిల్పములోనికి రాదు. కథాకథనశిల్పమన్నది ఇది కాదు. అది వేఱగు విషయము.

ఒకొక్కొక్కపుడు మఱి యొండొకవిషయము ఈశిల్ప మేమో యని భ్రాంతి గొలుపవచ్చును. ఇది చాల విచారిం చఁదగిన విషయము. పెద్దన్నగారి కథాకథనశిల్పమునుగూర్చి ప్రధానముగాఁ జెప్పుచు దీనినిగూర్చి విచారణప్రారంభించినచో నప్రస్తుతప్రశంస యగును. కాని దానినిగుఱించి యేకొంతయో చెప్పకపోయినచో తద్భావరూఢి కలుగదు. దానిని విస్తార ముగాఁ జెప్పకపోయినచో ఈకథాకథనములోని పెద్దన్నగారి వైశిష్ట్యము తెలియదు. ఇట్టి క్లిష్టమైన విషయ మిది. పెద్దన్న గారి కథాకథనశిల్పములోని వైశిష్ట్యముమాట యటుంచి దాని స్వరూపకథనము చేయుదును.

ఇతఃపూర్వము స్వారోచిషమనుసంభవ మను పేరు పెట్టి యీకావ్యమునందు భిన్నకథల కెట్లు సంయోజనము చేసెనో చూపించియుంటిని. ఇప్పుడు ప్రవరునికథ చెప్పుట లోని యొక విశిష్టలక్షణమును చూపింపఁ బ్రయత్నించెదను.

ఆంధ్రభాషలో ప్రబంధము లొకవిలక్షణమైన సాహిత్యశాఖ. దానివిలక్షణత్వ మెట్టి దనఁగా నాంధ్రసారస్వత మనినంతటనే ఇతిహాసపురాణములైన భారతభాగవతములను దాటి సారస్వతవేత్తయొక్క బుద్ధి పెద్దన్న, భట్టుమూర్తి, ధూర్జటి, తెనాలి రామకృష్ణయ్య, కృష్ణరాయలవారు, మొద

లైన వారిమీఁదికిఁ బ్రసరించును. ఆపురాణములు ఈప్రబంధములనడుమ నాచన సోముఁడును, శ్రీనాథుఁడును గలరు. శ్రీనాథుఁడు మఱియుఁ గలఁడు. ఆయనకావ్యములు ప్రబంధరూపమునందే యున్నవి. ఒకవిధముగాఁ జూచినచో నాంధ్ర ప్రబంధనిర్మాత శ్రీనాథుఁడే యనవలయును. కాని పెద్దన్న దానిలోని నిగ్గు లాగి ప్రబంధమునకు స్వస్వరూప మిచ్చినాఁడు.

ఈకథాకథనశిల్ప మన్నది ఈప్రబంధరూపములో లేదు. శ్రీనాథుఁడుగూడ తా నెక్కువ కథలు వ్రాయుచు కథాకథనము చేసెనుగదా ! ఆకథనములయందలి వైశిష్ట్యము సర్వథా నీక్రిందఁ జెప్పఁబోవువిషయములలో నంతర్భూతమైయుండును.

1. ఒకసన్నివేశము దానిలోని ప్రధానార్థము విస్పష్టముగా భాసించునట్లు చేసెడు నొకకల్పన. ఉదాహరణముగా హరవిలాసమున చంపిన తమకొడుకును పిలువుఁడని యోగి తలిదండ్రులకుఁ జెప్పెను. వారు నాల్గుదిక్కులయందుఁ బిలిచిరి. ఇవి రమ్యముగా నున్నవి. ఏల యనఁగా శివుఁడు పంచభూతాత్ముఁడుగనుక, సర్వదిక్కులయందు నిండియున్నాఁడుగనుక, శివునిలో కలిసిపోయిన కొడుకును దిక్కులయందే పిలువవలయును. ఈమహార్థముతో గూడియుండి, దానియందు రమ్యత భాసించుచున్నది. ఇది విశిష్టార్థవంతమైన కల్పనగాని కథ చెప్పుటలోని నేర్పు కాదు.

2. ఉత్తర హరివంశములో హంసడిభకుల కథ యున్నది. వారు వేటకు వెళ్ళిరి. ఋషులు యజ్ఞము చేయుచుండఁగా నచటికి పోయి చూచిరి. వారిని జూచి యూరకే

తిరిగివచ్చుట బాగుండదని "మానాయనగారు రాజసూయ యాగము చేయుచుండిరి. మిమ్మాహ్వానము చేయుటకు వచ్చితి" మనిరి. రాజసూయయాగము లేదు, ఏమియు లేదు. మొదటనను కొననేలేదు. అప్పు డది వారియంతట వారికిఁ దోచిన విషయము. అన్నా ముకదా యని యింటికి వచ్చి యాగారంభ మును గావించిరి. దానితో రగడ పెరిగినది. ఇది హంసడిభ కులయొక్క ధృష్టత్వముచేత అనిన మాట; చేసినచేత, ఇది కథాకథనశిల్పమా? అని విచారణచేసినచో కాకపోవును.

ఇట్టివి సారస్వతమునం దందందుఁ గలవు. వీని నన్నిం టిని కథాకథనశిల్పము లనుటకు వీలు లేదు. ఏల యనఁగా వానిప్రయోజనములు వేఱు. అవి కావ్యశిల్పమునం దంత ర్గతములు కావచ్చును. కథాకథనశిల్పమని నన్నయ్యగారి పెక్కుకథలు, పెద్దన్నగారి ఈప్రవరవరూథినీసమాఖ్యానములు మాత్రమే యనిపించుకోఁ దగినంత ప్రత్యేకతతో భాసించు చున్నవి.

నన్నయ్యగారి కథాకథనశిల్పము కొన్ని వ్యాసముల మున్నే విమర్శించి చూపితిని. ఆలక్షణము వేఱు. ఈ వరూథినీకథ చెప్పుటలోని లక్షణము వేఱు.

ఈయన కథను పురము, అచటి నాల్గువర్ణములు, వెల యాండ్రు – వీరివర్ణనతో నారంభించెను. దీనిని పట్టుకొని తరువాతి ప్రబంధకర్తలు పుష్పలావికలతోసహా పెద్దపెద్ద వర్ణనలు చేసిరి. కోట, కోటగోడ, పరిఖ, మేడలు, చాతు ర్వర్ణ్యము, తదితరవృత్తులు; వీని నన్నిటినిగాని వీటిలోఁ గొన్ని

టినిగాని యొకానొక ప్రసక్తి వచ్చినప్పుడు తత్పూర్వ్యాలుగూడ వర్ణించుట కలదు. భాగవతమునందే పోతన్నగారు ఒకటిరెండు చోట్ల నిట్టివర్ణనలు చేసిరి. ఈవర్ణనలు నేటికొందఱకు విసుగెత్తినవి. ఆవిసుగు పలుమంది వ్రాయుటచేతనే కలిగినది. కాని యిం దొకయౌచిత్య మున్నది. పూర్వకాలపు పట్టణములట్లుండెడివి. అన్నింటికి కోటగోడయు, పరిఖయు నుండెడివి. చిన్నచిన్నగ్రామములకుఁగూడ నుండెడివి. మఱియు నేగ్రామమున కాగ్రామమే. దేని కది స్వయంపోషకముగా, స్వయం సంపూర్ణముగా నుండెడివి. ఆనాగరకత గ్రామనాగరకత యనియు, నేటినాగరకత పట్టణనాగరకత యనుటయుఁ గలదు గదా ? కనుక నాగ్రామములు పట్టణములు నటువంటివి.

మఱియుఁ గావ్యము జీవితప్రతిబింబము కావలయు ననియు, తత్తత్కాలసాంఘికాదివ్యవస్థలకు ముకురభూతముగా నుండవలయు ననియుఁ జెప్పుచున్నారుగదా! పూర్వకవులు ప్రాకారపరిఖాదులను వర్ణించినచో తత్కాలపరిస్థితులను వర్ణించిరి. అది కవితాలక్షణము. అందు దోషమేమియును లేదే! అట్లే పెద్దన్నగారు చేసిరి. ఆయన రెండేపద్యములు వ్రాసెను. పట్టణముయొక్క వ్యవస్థలిని వర్ణించెను. రెండవ సీసపద్యములో చాతుర్వర్ణ్యమును, వెలయాండ్రను వర్ణించెను. చాతుర్వర్ణ్యముమాట యె ట్లున్నను వెలయాండ్రను వర్ణించుట తనకథకోసముకూడ వర్ణించెను.

అచటివెలయాండ్రు 'నాట్యరేఖాకళాధురంధరనిరూఢి' చేత రంభాదులు స్పర్ధ వహించినను 'కాసెకొంగున వారించి

గడపగల' వారు. ఇట్టివారిని దైవందినముగా ప్రవరుఁడు చూచు చు నేయుండెను. వారిసంగీతము తెలుంగును, వారినాట్యము తెలుంగును. వారియొయ్యారము తెలుంగును. అతఁడు మిక్కిలి సుందరుఁడు. 'మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి' 'అనారతా ధ్యాపనతత్పరుఁడు' అతనిని జాలమంది యువతులు కాంక్ష చేసిరి. వారి కతఁడు భోగబాహ్యుఁ డయ్యెను. అతఁడు యౌవన మందు యజ్వ, ధనాఢ్యుఁడు. మఱియు భాషావరశేషభోగి. ఇవి యతనియందున్న లక్షణములు. ఇట్టి లక్షణములు కల వానినిగా పెద్దన్న ప్రవరు నేల సృష్టించెను? ఈప్రవరుఁ డెట్టి వాఁడుగా పెద్దన్న యూహించియుండును? ఆనందవల్లిలో అనే కానందములు చెప్పఁబడినవి. అందులో మొదటిది ఇది: యువ కుఁడు, సాధుయువకుఁడు, వేదాధ్యయనపరుఁడు, ఆశిష్ఠుఁడు, ద్రఢిష్ఠుఁడు, బలిష్ఠుఁడు, అకామహతుఁడు, శ్రోత్రియుఁడు - ఈ దృగ్గుణసంపన్నుఁడు కలిగినచో వాఁడు పొందెడు నానందము అది ఏకమైన మానుషానందము. ఇది ఆనందమునకు మొదటి కొలత. ఈఆనందములు వందయైనచో మఱియొక యానందము. అట్టివి వంద మఱియొక యానందము. తుట్టతుదిది బ్రహ్మానంద ముగా వేదము చెప్పుచున్నది.

'స ఏకో మానుష ఆనందః'

దీనికి లక్ష్యభూతుఁడుగా ప్రవరుని పెద్దన్న నిర్మించి నాఁడు.

ఇతఁడు హిమాలయమునకుఁ బోవును. వరూథినిని జూచును. ఆమె మహాసౌందర్యవతి. పరమయౌవనవతి.

యాగాదిఫలమైన యప్సరస్త్రీసమాగమసుఖము నయాచిత
ముగా నీయఁ గూర్చున్నది. ఇతని నాకర్షించుటకు వంద
లయొయ్యారములు నెఱపినది. కోరికల్ గుబ్బటిలంగఁ జూచినది.
ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందగా నడచినది. తెప్ప
లల్లార్చి మెచ్చులు ప్రకటించినది. అంఘ్రికటకంబుల్
మ్రోయఁగా నడ్డమై నిలచినది. "ఇంతలు కన్ను లుండ" నని
నర్మగర్భముగాఁ బలికినది. 'పద్మసంభవవైకుంఠభర్గసభలు'
తమకు సాముగరిడీ లని వికత్థనత నెఱపినది. 'అంధునకుఁ
గొఱయె వెన్నెల ?' అని యాటాడినది. ఇట్టి వెన్ని చమ
త్కారములైనఁ జేసినది. దేనికిని ప్రవరుఁడు కదలలేదు. ఎందు
చేత కదలలేదు ? ఎందుచేత కదలలే దనఁగా ఆయూరివెల
యాండ్రు నాట్యరేఖాకళాధురంధరనిరూఢిచేత రంభాదులను
గూడ లెక్కసేయరు. ఈలక్షణములన్నియు నాతఁ డెఱిఁగినవే.
వీనిలో నతని కేమియుఁ గ్రొత్త లేదు.

పైఁగా, పెద్దన్నగారు వాడినది 'నాట్య' అన్న శబ్దము.
నృత్యనృత్తములను వాడలేదు. ఆయూరివెలయాండ్రు నర్త
కులు గాదు, నాట్యకత్తెలు. నాట్య మనఁగా వాక్యార్థాభి
నయము. అనఁగా సర్వవిధనాయికాస్వరూపములు, అను
భావవ్యభిచారిసర్వభావాభినయము వా రెఱుఁగుదురు. లోకో
త్తరముగా ప్రదర్శించనుగలరు. వాని నన్నిటి నెఱిఁగిన
ప్రవరుఁడు వరూథినియం దాలక్షణములనుజూచి ఏమియు
నబ్బురపాటు చెందఁడు.

అంతటితో నాగరక వరూథిని 'ఆనందో బ్రహ్మ' యని భృగువల్లి చదివినది. దుర్వ్యాఖ్యానము చేసినది. దానితో నతనికి మఱియు వెగటు వేసినది.

ఇది కథాకథనశిల్పము. ఇం దేమి యున్నది? ఒక కథను జెప్పెడి లక్షణము కలదు. ఆకథ నొక వైలక్షణ్యముతోఁ జెప్పుట కలదు. ప్రవరుఁడు వరూథినిని జూచెను. ఆమె ఇతనిని ప్రేమించెను. తనకోర్కెఁ దెలిపెను. ఇతఁడు నిరాకరించెను. ఇది సామాన్యకథ. మార్కండేయ పురాణములో నున్నదే. దీని కనేకవిషయములు కలిపి పెద్దన్న కావ్యముగా వ్రాసెను.

ఒకకథ యొకపద్ధతిగా జరుగుటకు హేతునిరూపణము శిల్పములోని భాగము. ఆహేతువులు పాత్రపోషణమునకో, సంవిధాన పోషణమునకో, కవితారామణీయకమునకో పరిపోషకము లైనచో వానియందు కథాకథనశిల్పము లోపించును. కవితాశిల్ప మెక్కువ భాసించును.

ఇందాక చెప్పిన నాచన సోమన్న హంసడిభకుల వ్యవహారము వారిదుర్జనత్వగుణాపాదకమై అది కథాకథన శిల్పము కాకపోవుచున్నది.

ఇది యట్లు కాదు. ఇది అచ్చముగా కథాకథనశిల్పము. ఏల యనఁగా ప్రవరుఁడు వైరాగ్యవంతుఁడు, ఏకపత్నీవ్రతుఁడు, అగ్నిహోత్రి. ఇంతియే గాక ఆయూరివెలయాండ్రనాట్యవైభవ మెఱిఁగినవాఁడు. అతఁడు వరూథినిని జూచినప్పుడు కోరిక యొట్లును లేదుగదా, ఆశ్చర్యముకూడ లేదు.

ఈకథా కథనములో నున్న వైచిత్రి యిది: కొన్ని లక్షణములు కలిగిన యొకపురుషుఁ డున్నాఁడు. అట్టివానికి నొకసంవిధాన మేర్పడును. ఈదృగ్లక్షణసహితుఁడైనవాఁడు ఆసంవిధానమునం దెట్లు ప్రవర్తించును? స్వలక్షణాను సారముగనే ప్రవర్తించును. కలిగిన సంవిధానము ఫలవంతము. కాని లక్షణము వానిశీలమునందే కలదు. నిస్సంశయముగా ఆసంవిధానవైయర్థ్యమే ప్రాప్తించును.

ఒకవేళ భిన్నముగా జరుగవచ్చును. జరుగుటకు వీలు లేదు. అందుచేత భిన్నముగా జరుగలేదు. తనరచించిన కథలో ఇట్టిలక్షణములు పెట్టి కథానిర్మాణము చేసి ఆకథను నూత్నౌంశరమణీయముగాఁ జిత్రించి రచించుటలోననే కథా కథనశిల్ప మున్నది.

తాత్పర్య మిది: ఏవంభూతలక్షణసహితుఁడైన పురుషునకు ఏవంభూతలక్షణసహితురాలైన స్త్రీతోడి కలిసికొనుట జరిగినది. ఫలిత మే మగును? ఏ మగునో మొదటనే చెప్పఁబడినది. ఆవెలయాండ్రలక్షణము చెప్పుట, అతఁడు వైరాగ్యవంతుఁ డగుట – మొదలైనవానియందే వరూథినీసమాగమ ఫల మిమిడియున్నది. ఇంతే.

——(o)——

## ౮

# ఆనంద మీమాంస

వరూథిని ప్రవరునితో

శా॥ ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోప నెందెందు నే
కెందే నింద్రియముల్ సుఖంబు గన నాయింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాజ్ఞుదువు నంతస్పూర్తి నూహింపుమా.

అన్నమాటకు ప్రవరుడు

"మోక్షలక్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో
మీసంప్రదాయార్థముల్"

అని సమాధానము చెప్పినాడు. అంతకంటె నిచ్చట వేరే ప్రసక్తి చెయ్యబడలేదు. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అన్న తైత్తిరీయములోని మాటను వరూథిని యుదాహరించినది. ఆయానందమున కొక వ్యాఖ్యానము చేసినది. ఆవ్యాఖ్యానము సంప్రదాయార్థము కాదని ప్రవరుడు త్రోసివేసినాడు. ఆవ్యాఖ్యాన మెట్టిది? అది సంప్రదాయార్థ మేల కాదు? తొలుత తైత్తిరీయములోని యీమాట యేసందర్భమునందు కలదు? ఈ ఆనందమీమాంస ఆనందవల్లిలో కలదు. యువకుడు, సాధుయువకుడు, అధ్యాయికుడు, ఆశిష్ఠుడు, ద్రఢిష్ఠుడు, బలిష్ఠుడు, అతనికి సర్వమైన పృథివి విత్తముతో నిండియున్నది. వాడు శ్రోత్రియుడు, అకామహతుడు, అతనికి ఏకమైన మానుషమైన యానందము. ఈ యీలక్షణములు కలవాడు ఒక ఆనందమును పొందు

చుండును. ఈయానందము ఒక కార్యమును పురస్కరించు కొని, ఒక వేళను పురస్కరించుకొని, ఒక నిమిత్తమును పురస్కరించుకొని పొందునదిగా కనిపించుటలేదు. ఆయాలక్షణములు గలిగినవాడు ఆయానందము కలిగినవాడుగా చెప్పబడు చున్నాడు. ఇది విచారించగా నిట్లు తోచుచున్నది. ఒకని కొక లక్షరూపాయలు వచ్చినవేళ కలదు. ఆవేళయందు వాడొక సౌఖ్యమును పొందుచున్నాడు. దాని కీయీయానందమునకు సంబంధము లేన ట్లున్నది. ఆయానందము పూర్వము చెప్పినట్లు 'నిమిత్తజన్యము' కాదు. మరి యెట్టి దనగా – ఒకడొక గొప్పయింట పుట్టెను. ఆగర్భశ్రీమంతుడు, విద్యావంతుడు, ఆరోగ్యవంతుడు, అదృష్టవంతుడు. వాడొకయానందమనుభవించుచుండును. అది వానిమనస్సునకు నిత్యలక్షణము. ఇట్టి నిత్యలక్షణమునుగూర్చి యీయానందము చెప్పబడినట్లు కనిపించుచున్నది. అంతియేకాని, ఒక హేతువుచేత కలిగిన యొక తాత్కాలికమైన తృప్తి యీయానందమునకు లక్షణముగా కనిపించదు. కావున రతిజనితసౌఖ్యము ఆయానందముగా వరూథిని చేసిన వ్యాఖ్యానము వేదసమ్మతముగా లేదు. అందుచేత ప్రవరుడు దీనిని త్రోసివేసెనా ?

యోగులు సమాధిగతులై ఆత్మనాత్మయందు అపహృతేంద్రియులై చూచుకొందురని, అది యొక స్థితి యని, తత్కాలమునందు ఆనందము పొందుచుందురని చెప్పినచో – ఆస్థితి ఆనంద మని ఎక్కడను లేదు. అదియును పొసగదు.

లోకమునందుమాత్రము ఆనందమున కిట్టి వ్యాఖ్యానము చేయుట కలదు. లోకమునందున్న పలుభావములు సూక్ష్మవిచారితములు కావు. అట్లు కాని వాక్యమునే వరూథిని స్వీకరించి చెప్పినది.

పెద్దన్న విశిష్టాద్వైతి. ప్రవరుని విశిష్టాద్వైతిగానే యాతన యూహించియుండును. కాని యతని అగ్నిహోత్రములు, అతని కర్మిష్ఠిత – మొదలైనవి విశిష్టాద్వైతముకంటె స్మార్తమునందు ప్రవగుని నివిష్టాత్ముని గా జూపుచున్నవి. ఈ ప్రవరుని యాగ్నిహోత్రత్వము విశిష్టాద్వైతమువైపునకు మొగ్గుట లేదు. ప్రవరునికథ యంతయు విశిష్టాద్వైత ప్రతిపాదకముగా లేదు. ఈ సంగతి పెద్దన్నగారికిగూడ దెలియును. కనుకనే తాను విశిష్టాద్వైతియై తన్మప్రతిపాదకముకాని కావ్యము తాను వ్రాసితినని తుదకు కొంత విశిష్టాద్వైతమును ప్రవేశపెట్టినాడు. లేనిచో నాయన మనస్సునకే తృప్తి లేదు.

తన మతమునకు ఈ 'యానందో బ్రహ్మ' యన్నమాట సరిపోదు. అందుచేత దానిని "యివియా మీ సంప్రదాయార్థము" లని త్రోసిపుచ్చినాడు. సరే. వరూథిని చెప్పిన యర్థము సంప్రదాయార్థము కాదు. తనసంప్రదాయార్థ మేమి? దానిని చెప్పలేదే! చెప్పినచో నది యెట్లుండును ! విశిష్టాద్వైతమునందు ఆనందము పరమేశ్వరస్వరూపము. ఈ యానందము రెండుమూడు విధములుగా చెప్పవచ్చును. వైకుంఠములో ఒకమేడ యున్నది. దానిపేరు ఆనందము.

శుద్ధసత్త్వమున్నది. త్రిగుణముల చేత నేర్పడు ద్రవ్యము కానిదియు, సత్త్వము కలదియు. దానికి విభూతి యని పేరు,

అది యూర్ధ్వలోకములం దనంత మైనది. అధోలోకములందు పరిచ్ఛిన్న మైనది. అది యానందము నావహింపజేయును. దానికి ఆనందమని పేరు. దానికే పంచోపనిషదాత్మిక యని, పంచశక్తిమయి యనియును పేరు. ఈ యానందము నారాయణస్వరూపము. నారాయణుడు కాదు. ఇట్టి భావము ప్రవరున కున్నదా! ఉన్నదో లేదో! అత డీవ్యాఖ్యానము చేయవలసిన యవసరము లేదు. చేయలేదు. అందుచే నిచట ప్రవరు డద్వైతియో విశిష్టాద్వైతియో మనము నిర్ణయించలేము. అతని కర్మిష్ఠితను పురస్కరించుకొని మనము వానిని స్మార్తుడుగా, కర్మిష్ఠిగా భావించవచ్చును.

కాని యీకావ్యము పేరు "స్వారోచిషమనుసంభవము." కావ్యముయొక్క పరమార్థము - స్వారోచిషమనువు పుట్టుట. అతడు పుట్టినాడు. అత డకాముడై చిరతపము చేసినాడు. అతనికి లక్ష్మీశ్వరుండు కనిపించినాడు. ఆ లక్ష్మీశ్వరుని ఆయన యిట్లు స్తుతించినాడు.

అవ్యయానంత ! విశ్వాత్మక ! విశ్వేశ !
బ్రహ్మవు నీవ కపర్ది నీవ
యింద్రుండ నీవ, వహ్నివి యనిలుండ నీవ,
వరుణుండ నీవ, భాస్కరుండ నీవ
యముండ నీవ, వసూత్కరము నీవ రుద్రులు
నీవ, యాదిత్యులు నీవ, విశ్వు
లీవ. మరుత్తులు నీవ, మంత్రములు నోంకృతి
వషట్కృతి శ్రుతిస్మృతులు నీవ

వేద్య మీవ, యీవచ్చిన విబుధగణము
సర్వమును నీవ, యె ట్లన్న సర్వగతుండ

వగుట మఱి నీవు గానివాఁ డవఁగ నెవ్వఁ
డరయఁగను శేషభూత ! నమ స్తశేషి !

ఈ పద్యార్థము స్థూలముగా చూచినచో నద్వైతము గానే చెప్పవచ్చును కాని పెద్దన్నగారు తన విశిష్టాద్వైతము నీపద్యములో స్థాపించినాడు జగత్తునకు కారణ మెవ్వరు ? ఈచర్చ వచ్చినప్పుడు విశిష్టాద్వైత మతములో నారాయణుడు తప్ప మరియొకడు కాడని సిద్ధాంతము. బ్రహ్మ కారణ మన్నచో వేదములయందు ఇంద్రాగ్నులు, సూర్యుడు, సోముడు, కుబేరుడు, యముడు, వరుణుడు మొదలైన యెల్లరు శ్రుతులయందు తత్తత్ప్రదేశముల హేతువులుగా చెప్పబడిరి. శ్వేతాశ్వతరమునందు శివుడు కారణముగా చెప్పబడినది. అధర్వమునందు రుద్రుడు చెప్పబడినాడు. తైత్తిరీయము నందు హిరణ్యగర్భుడు జగత్కారణుడుగా చెప్పబడినాడు. వీని యన్నింటికి సామాన్య విశేష న్యాయమువలన వారు వారు కారు. నారాయణుడే హేతు వని సిద్ధాంతము. విశిష్టా ద్వైతులకు నారాయణోపనిషత్తు పరమప్రమాణము. మరియు నిట్టిగ్రంథములు కొన్ని కలవు. వానినిబట్టి నారాయణునకే పరమ కారణత్వము, సర్వశబ్ద వాచ్యత్వము, మోక్షప్రద త్వము. అందుచేత స్వాయంభువు అన్నను హిరణ్యగర్భు డన్నను, ప్రజాపతి యన్నను, నారాయణు డనియే అర్థము. ఒకటి యేమి ! దహరాది సర్వవిద్యలయందు చెప్పబడిన రుద్రాదులు నారాయణవాచ్యులే. నారాయణునిలోన నున్న గుణజాతములే ఉపాస్యములు. భేదాభేద శ్రుతు లన్నియు ఘటక శ్రుతులచేత విరోధము పరిహరించుకొని నారాయణుని

యందే సర్వము సమన్వీత మగుచున్నది. అన్నియు నారాయణుడే.

ఈపద్య మందుచేత విశిష్టాద్వైత ప్రతిపాదక మైనది. అందుకనియే "శేషభూత సమస్త శేషి" అన్న సంబోధన చివరకు విశిష్టాద్వైత మతమును ప్రతిపాదించుచున్నది.

ఈస్వారోచిషుడు దశావతారములను వర్ణించినాడు. విశిష్టాద్వైతులయొక్క దశావతారములలో బుద్ధుడు లేడు. బలరాముడు, కృష్ణుడు నిద్దఱు రెండవతారములు. అందు చేత పదియును పూర్తియగును. ఈ పెద్దన్నగారి దశావతార వర్ణనలలోని రహస్యమిది.

మరియును దశావతారములను వర్ణించినంతమాత్ర మున నారాయణ ప్రతిపాదక మగునా? అనగా అగును. విశిష్టాద్వైతమున ఈశ్వరుడు - అయిదు విధములుగా నుండును.

ఒకటి పరుడు. రెండు వ్యూహాగతుడు. మూడు విభువు, నాలుగు అంతర్యామి. అయిదు అర్చారూపుడు. ఇందులో మూడవవాడైన విభుడు అవతారములు పొందును. ఈ యవ తారము లనంతములు, ప్రాధాన్య వివక్షచేత దశావతారము లను నెన్నిక. ఈ యవతారములకు ఇచ్ఛయే హేతువు. కర్మ కాదు. దుష్కృతివినాశపూర్వకమైన సాధుపరి త్రాణమే వీనికి ప్రయోజనము.

అందుకని అవతారములు వర్ణించుట నిస్సంశయముగా విశిష్టాద్వైత మతప్రతిపాదకము. పెద్దన్నగారు తన మతమును మనుచరిత్రమునందు చివరకు వెలయించినాడు.

తక్కిన కవులు ఆయన చేసిన శిల్పములలోని రహస్యములు తెలియక అనేకములను అనువదించుకొన్నారు. మక్కికి మక్కిగా దించికొన్నారు. ఆయన తెలుగులో స్వతంత్ర ప్రబంధరచనకు పితామహుడు. ఆయనదృష్టి మరి యెవ్వరికిని లేదు. ఆయన మహాశిల్పి. ఆంధ్రప్రబంధసరస్వతి ఆయనగా నవతరించినది.

ఈ వ్యాసములందు చెప్పిన విషయములన్నియు శిల్పదృష్టితో చెక్కబడినవి. ఈశిల్పము పద్యరచనాతిశాయి శిల్పము పద్యరచనాగత శిల్పము వేరే యున్నది. ఆశిల్పమునకుగూడ మహావ్యాఖ్యాన మవసరమైనదే. ఏల యనగా, ఆ శిల్పముకూడా ఆయనయందే పరాకాష్ఠ పొందినది. దానినిగూర్చి చెప్పుటయుగూడ సులభము కాదు. దానియొక్క స్వరూపము ఎక్కువ భాగము అక్షర సన్నివేశరమణీయతమీద నాధారపడియుండును. పూర్వమహాకవుల రచనల పఠించి, పూర్వసంస్కారవిశేషముచేత పాఠకుడు ఈ కూర్పునందు సౌకుమార్యము కలదు, ఈ కూర్పునందు బిగువు కలదు, ఈకూర్పునందు మాధుర్యము కలదు, ఈసౌకుమార్యముకంటె నిది యధికమైనది, ఈబిగువుకంటె నిది యధిక

మైనది - ఈరీతిగా వానికి వాడు నిర్ణయించుకోదగిన విషయము. ఒకానొక విధమైన పద్యరచన, ఒకానొక విధమైన సమాస గ్రథనము - ఒకడు ప్రౌఢముగా నున్నదనుకొనవచ్చును. మరియునొకడు కా దనుకొనవచ్చును. ఎట్లయినను నొకసామాన్యబుద్ధి సర్వరచనయం దనుస్యూతముగా సర్వపాఠకులకు నుండును. విశేషములయందే భేదము భాసించును.

కాని యీవ్యాసములందు వ్రాయబడిన భావవిషయికమైన శిల్పమునందు బుద్ధిమంతులకు విప్రతిపత్తి యుండదు. అందుచేత నిదియే బహుధా పరామృష్టమైనది.



భారత ముద్రణాలయము, విజయవాడ - 2.